# సిద్ధపురుషులు

డాక్టర్ T. M. P. మహాదేవన్

అనువాదం:
విద్వాన్, విశారద
సూరాబత్తుల సుబ్రహ్మణ్యం, ఎమ్. ఏ., ఎల్. టి.



ఓరియంట్ లాంగ్మన్స్
బొంబాయి - కలకత్తా - మదరాసు - న్యూఢిల్లీ

ఓరియంట్ లాంగ్మన్స్ ప్రైవేట్ లిమిటెడ్
17, చిత్తరంజన్ అవెన్యూ, కలకత్తా 13
నికల్ రోడ్, బల్లార్డ్ ఎస్టేట్, బొంబాయి 1
36A, మౌంట్ రోడ్, మదరాసు 2
కాన్పూర్ హౌస్, 24/1, ఆసఫ్ అలీ రోడ్, న్యూఢిల్లీ
గన్ ఫౌండ్రీ రోడ్, హైదరాబాద్
17, నాజిముద్దీన్ రోడ్, ఢాకా

లాంగ్మన్స్ గ్రీన్ అండ్ కంపెనీ
6-7, క్లిఫర్డ్ వీధి, లండన్ W. 1
న్యూయార్క్, టొరాంటో, కేప్ టౌన్, మెల్బోర్న్

మొదటి ముద్రణ, 1960

వెల: రూ. 1.60

SIDDHA PURUSHULU
Telugu version of
LIVES OF SAINTS
*by* DR T. M. P. MAHADEVAN

*Translator*.
S. SUBRAHMANYAM, M.A., L.T.

First Edition: 5,000 copies – April 1960

PRICE: Re. 1.60.



*Published under the auspices of*
*The Southern Languages Book Trust, Madras*
TELUGU: 57

*Printed at the Jupiter Press Private Ltd., Madras-18*

# పరిచయము

ప్రజాసామాన్యానికి ఆకర్షణీయంగా, విశేషోపయోగకరంగా ఉండే పుస్తకాల ప్రచురణకు దోహదం చెయ్యాలనే సంకల్పంతో దక్షిణ భాషా పుస్తకసంస్థ లోగడ కొన్ని పుస్తకాలను ప్రచురింపజేసింది. ఆ ప్రచురణలవలన కలిగిన అనుభవంతో ఇప్పుడు మరికొన్ని పుస్తకాలను వివిధ ద్రావిడభాషలలోకి అనువాదం చేయించి ప్రచురింపజేస్తూంది. పాఠకులలో భిన్న భిన్న అభిరుచులకు తగినట్లు ఈ పుస్తకాలను శ్రద్ధగా ఎన్నిక చేశారు. అందువల్ల మానవజీవితానికి సంబంధించిన వివిధ విషయాలను గురించిన రచనలు ఇందులో ఉండటం సహజం. భారత మహానాయకుల జీవిత చరిత్రలు, వారు చేసిన ఘనకార్యాలు వివరించే గ్రంథాలు ఈ ద్వితీయ గ్రంథ పరంపరలో ఒక శాఖ. మన దేశ శ్రేయస్సుకోసం, అభ్యుదయంకోసం ఆ మహాపురుషులు ఏమి చేసినది, వారికి తామెంత ఋణపడి ఉన్నది, ప్రజలకు ముఖ్యావశ్యకములైన హక్కులను సంపాదించటానికి వారెన్ని పాట్లు పడినదీ ముందు తరాల వారంతా తెలుసుకుని ఉండటం మంచిది.

తత్త్వశాస్త్రం, మతం, విజ్ఞాన శాస్త్రం, సాహిత్యం—ఈ గ్రంథపరంపరలోని ఇతర శాఖలు, కథానికలు, ప్రాచీన కళా సంపదలను అభివర్ణించే గ్రంథాలుకూడా ఇందులో ఉండటం ముదావహం. నాటక కళ, శిల్పశాస్త్రం, పురావస్తు పరిశోధనలు, నిరతాద్భుతావహములైన దాక్షిణాత్య దేవాలయాలను గురించిన గ్రంథాలు ఈపరంపరలో ఉన్నవి. విజ్ఞాన వికాసదాయకములైన భిన్న భిన్న విషయాలను గురించిన ఈ గ్రంథాలు ప్రజలను విశేషంగా ఆకర్షింపగలవని, ఆ

విధంగా ఇట్టి ప్రచురణలకు ముందు విస్తార ప్రచారం కలుగ గలదని నా విశ్వాసం.

దక్షిణ భారత భాషలలోని ఉత్తమ గ్రంథాలు కొన్నింటిని మిగిలిన దాక్షిణాత్య భాషలలోకి అనువదింపజేయుటం ఈ ద్వితీయగ్రంథ పరంపరలోని మరొక ప్రశంసనీయమైన విశేషం. ఈ పుస్తకాలన్నీ పూర్తిగా వెలువడినప్పుడు, విద్యావంతులలో ఎక్కువ మందిని వివిధ విషయాలను గురించిన జ్ఞానాసక్తిగల పాఠకులనుగా ఆకర్షించి, ఆ జ్ఞాన పిపాసను తృప్తి పరచటానికి యోగ్యమైన గ్రంథాలనుకూడా వారికి అందజేసినట్లు అవుతుంది.

ఈ దక్షిణ భాషా పుస్తకసంస్థ ఆశయాలు శీఘ్రగతిని సఫలం కాగలవని ఆశిస్తున్నాను.

ఇట్లు,

మద్రాసు,
7-10-1958.

డా॥ ఎ. లక్ష్మణస్వామి మొదలియార్,
వైస్ ఛాన్సెలర్,
మద్రాసు విశ్వవిద్యాలయం.

# పీఠిక

సిద్ధపురుషులనుగూర్చి వ్రాయుట సులభమైనపనికాదు. ఉత్తమవిషయము లన్నియు నపురూపములు, కష్టసాధ్యములుగానే యుండును. అపురూపములు, కష్టసాధ్యములు కదా యని ఉత్తమ విషయ ప్రయత్నము మానరాదు. పనికిమాలినవానిని సాధించుటకన్న మహత్తర విషయముగూర్చి ప్రయత్నించి విఫలులమైనను మంచిదే! పనికిమాలినవను జ్ఞానము లేక మన మనేకుల మధికకాలము స్వల్పవిషయములకొఱకే పాటుపడుచున్నాము. ఇట్టి స్వల్పవిషయముల విడనాడి, సిద్ధపురుషస్థితియగు శాశ్వతత్వముకొఱకు పాటుపడినప్పుడే నిజమైన జీవిత మారంభమగుచున్నది. సిద్ధుల జీవితములను, వారిబోధలనుగూర్చి తరచి తరచి విచారణచేయుటే మన జీవిత మున్నత మొనర్చుకొనుటకు పటిష్ఠమైన సాధనము. ఈ పుస్తక మిట్టి మార్గమున నొక వినయపూర్వక ప్రయత్నము.

ఈ పుస్తక ప్రవేశికలో సిద్ధత్వముయొక్కయు, సిద్ధపురుషులయొక్కయు, ముఖ్యాంశములువివరింపబడినవి; నిర్ణాయకముగాకాక సూచనప్రాయముగా వివరింపబడినవి. అన్ని దేశకాలములందు సిద్ధపురుషతత్వముసమానమే. ఈ పుస్తకములో పదిమంది హిందూదేశ సిద్ధపురుషుల జీవితములున్నవి. వీరి జీవితములనుగూర్చియే వ్రాయుటకు ప్రత్యేకకారణములేదు. ఎందరోసిద్ధపురుషులున్నారు; వారందరినిగూర్చి వ్రాయుటకు స్థలము చాలదు. అదిగాక గ్రంథకర్త కెక్కువగా తెలిసిన సిద్ధుల జీవితములే వ్రాసెను. ఈ సిద్ధులలో నొక్కరు తప్ప తక్కినవారందరు దక్షిణ హిందూదేశమున జన్మించినవారే. ఐనను వీరందరు విశ్వమానవ ప్రపంచమునకు చెందిన వారగుటచే వాసస్థాన మిదియని యేఒక్కరిది కూడ నిర్ణయించ వీలుపడదు. వీరి వ్రాతలనుబట్టి సంగ్రథితములైన వీరి పలుకులనుబట్టి, వీరి బోధలు జీవితములతోబాటు చేర్చబడెను. మానవజాతిలో ఆధ్యాత్మికప్రతిభాసంపన్నులగు సిద్ధపురుషులనుగూర్చి యింకను చదువుటకును, ఇంకను తెలిసికొనుటకును పిపాస యీ పుస్తకము చదువుటవల్ల పాఠకులకు కలుగునని ఆశించుచున్నాము.

మద్రాసు,
12-6-1959.

టి. ఎమ్. పి. మహాదేవన్.

# విషయసూచిక

# ప్రవేశిక

సిద్ధపురుషు లన్ని దేశములలో పుట్టుదురు. కాని హిందూదేశములో చరిత్రారంభమునుండియేగాక చరిత్రకు పూర్వమునుండికూడ ఇతరదేశములలోకన్న నెక్కుడుగా నుద్భవించిరి. సింధునదీ నాగరకతకు దొరికిన చిహ్నములలో శివుడుగా భావింపబడుచున్న ఒక ధ్యానపురుషుని మూర్తిగల ముద్రయొకటి కలదు. వేదమంత్ర ద్రష్టలు ఋషికవులు. వారికి పదార్థముల అంతరాత్మ ద్యోతకమయ్యెడిది. రాజు అని, కవి అని వారినిగూర్చివాడిన పదములు వారు శాశ్వత సత్యతత్త్వమును దర్శించిరని తెలుపుచున్నవి. ఉపనిషత్తులలో యాజ్ఞవల్క్యుడు, ఉద్దాలకుడు మొదలగు అనేక గురువులు పేర్కొనబడిరి. వారందరు సిద్ధపురుషులై యుండవలెను. మాయను జయించిన సిద్ధపురుషుల విజయములు కీర్తించుటే పురాణేతిహాసముల ముఖ్యోద్దేశము. భగవద్గీతలో శ్రీ కృష్ణుడు చెప్పినట్లు సాధువుల రక్షించుటకును, దుష్టుల శిక్షించుటకును భగవంతుడు భూలోకమున నవతరించును. మత మునకును వేదాంతమునకును హిందూదేశములో సామరస్యము కలదు గాన హిందూ వేదాంతులందరు సిద్ధపురుషులే.

వివిధవేదాంతములను చక్కదిద్దిన ఆది పురుషులను సూత్రకారులందురు. వారును సిద్ధపురుషులే. నైయాయికులు

కూడ మనుష్యుని ఆధ్యాత్మికశక్తు లభివృద్ధిపరచు టవసరమని ఒప్పుకొనిరి. ఆచార్యత్రయము – శంకర రామానుజ మధ్వాచార్యులు – సిద్ధపురుషులే. బౌద్ధ జైన నాస్తిక మతములలోకూడ సిద్ధపరంపర అవతరించెను. దర్శన యుగానంతరము దేశమున ననేక ప్రాంతముల బయలుదేరిన భక్తి ప్రచారముకూడ జ్ఞానులగు గొప్ప సిద్ధపురుషులచేతనే నడుపబడెను. సాంఘిక సంస్కరణలుకూడ చాలవరకు సిద్ధపురుషుల ప్రోత్సాహమువల్లనే జరిగెను. సమర్థ రామదాసు, విద్యారణ్యస్వామి మొదలగు స్వాములు రాజకీయరంగములోకూడ దేశసేవచేసిరి. జీవితమున నన్నిశాఖలలోను అవిచ్ఛిన్న సిద్ధపరంపర కలిగియుండుటే ప్రపంచములోకెల్ల హిందూదేశము యొక్క విశిష్టత.

సిద్ధులలో జాతి మత స్త్రీ పురుష భేదములు లేవు. సంకుచితత్వము నధిగమించినవాడే సిద్ధుడు. అనుకొనని స్థలములలో, అధమకుటుంబములలో సిద్ధులు జన్మించిరి. అంత విరివిగా కాకపోయినను ధనిక కుటుంబములలోగూడ వారు జన్మించిరి. మధ్యమయుగములో మొత్తముమీద స్త్రీస్వాతంత్ర్యము కొంత తగ్గినది. కాని ఎన్ని నిర్బంధములలో నున్నను హిందూ స్త్రీజాతినుండి సిద్ధురాండ్రుద్భవించుచునే యుండిరి. భగవంతుని దర్శించుటకు వారెట్టి త్యాగములైనను చేసిరి. సిద్ధత్వము దుర్బలులకుకూడ అసమానశక్తి నిచ్చును. భగవద్భక్తి ఆవేశించిన వారిని ప్రపంచపు కట్టుబాట్లడ్డవు. “భక్తులు గద్గదకంఠముతో, పులకితదేహముతో, అశ్రుమయ నయనములతో భగవంతునితో ప్రసంగింతురు,” అని నారద

భక్తిసూత్రములలో జెప్పబడినది. మహాభక్తులగూర్చి చెప్పుచు నారదుడు, "వారు తమ కుటుంబములను, ప్రపంచమునుకూడ పవిత్రమొనరింతురు. పుణ్యక్షేత్రముల పవిత్రమొనర్తురు. కార్యముల ధర్మసమ్మతమొనర్తురు. శాస్త్రముల కధికారమిత్తురు. కులము, విద్య, అందము, వంశము, ధనము, వృత్తి వల్ల కల్గు భేదములు వారిలో లేవు," అని వ్రాసియున్నాడు. "నేను ధనమును, అధికారమును లెక్క-సేయను. కుష్ఠరోగముచే నవయవములు తినబడినవానినైనను, గోమాంసము తిను జాతివానినైనను భగవద్భక్తుడైనచో బూజింతు"నని సిద్ధపురుషులలో నగ్రగణ్యుడగు తిరునావుక్క-రసర్ పాడియున్నాడు. భగవత్సాక్షాత్కారము కల్గినవానికి ఉచ్చనీచ భేదములులేవు. భగవద్గీతలో జెప్పినట్లు విద్యావినయములుగల బ్రాహ్మణుని, గోవును, ఏనుగును, కుక్క-ను, ఆ కుక్క-నుతిను ఛండాలుని పండితులు సమదృష్టిని జూతురు. సిద్ధులొక దేశమునకు జెందినవారుకారు, వారు ప్రపంచపురుషులు. సంకుచిత సంబంధములు వారికి లేవు.

సమయాచార్యులకును సంతనాచార్యులకును కొందరు భేదము కల్పింతురు. ఇది వారివారి అభిమతమునుబట్టి కల్పించు భేదముమాత్రమే. సమయాచార్యు డనబడు తిరుజ్ఞానసంబంధర్ వేదాంతికాడా? సంతనాచార్యులలో మొదటివాడగు మైకందు గొప్ప సిద్ధపురుషుడుకాడా? సిద్ధులలో భక్తులకును జ్ఞానులకును కల్పించిన భేదముకూడ ఇట్టిదే. భక్తులు హృదయముద్వారాను, జ్ఞానులు బుద్ధిద్వారాను సత్యమును గ్రహింపజూతురందురు. కాని ఇట్టి భేదముండవలె

నని సిద్ధాంతము లేదు. హిందూదేశమున భక్తులకు జ్ఞానుల లక్షణములుకలవు; జ్ఞానులకు భక్తుల లక్షణములు కలవు. భక్తుడగు రామకృష్ణుడు మహాజ్ఞాని కాడా? జ్ఞానియగు రమణ మహర్షిలో భక్తి లేదా? నిజమైన భక్తుని భక్తి, జ్ఞానసంబంధము లేని వట్టి ఆవేశము కాదు. జ్ఞానియొక్క జ్ఞానము దివ్యావేశము లేని శుష్కధీసంబంధమాత్రము కాదు. మత శాఖల భేదమునుబట్టి భక్తికిగాని జ్ఞానమునకుగాని హెచ్చు ప్రాధాన్యమివ్వవచ్చును. కాని అన్ని శాఖలవారును భక్తి జ్ఞానముల రెండింటి ఆవశ్యకత గుర్తించియే యున్నారు. జ్ఞానులతోను, భక్తులతోను, రాజ యోగులను కర్మయోగులనుకూడ జేర్చవలసి యున్నది. పతంజలి యోగసూత్రముల ననుసరించి యోగ మభ్యసించువారు రాజయోగులనబడుదురు. వీరు యేకాగ్రధ్యానముద్వారా మనస్సును వశము చేసుకొని తానే ఆత్మనను భావము మనస్సునకు లేకుండ జేతురు. పతంజలి యోగమునకు కైవల్యమనగా ఆత్మయొక్క అద్వైతభావమును గ్రహించుటే గమ్యము. నిష్కామకర్మ నొనర్చువారు కర్మయోగులు. వారు స్వార్థముకోరక తమ ధర్మములు నిర్వర్తింతురు. కార్యములను, ఫలములను భగవదర్పితముసేతురు. దానితో ఫలాసక్తి తొలగిపోవును. అహము నశించును. మనస్సు పవిత్రమగును. పై వచించిన అన్ని రకముల మహాపురుషులకు సిద్ధుడన్న పదము వర్తించును. శుకుని వంటి జ్ఞానులు, నారదునివంటి భక్తులు, విశ్వామిత్రునివంటి రాజ యోగులు, జనకునివంటి కర్మయోగులు నొకరిపద్ధతి కొకరు సంబంధము లేనివారు కారు. జ్ఞానియగు శుకుడు భక్తుడు

కూడ. భక్తుడగు నారదుడు జ్ఞానికూడ. విశ్వామిత్ర జనకుల సంగతికూడ అట్టిదే. వారందరు జ్ఞానము, భక్తి, ఆత్మనిగ్రహము, సేవాభావము కలవారే.

సామాన్యప్రజలు సిద్ధులకును, మాహాత్మ్యములకును ముడిపెట్టుదురు. కొన్ని అప్రాకృతశక్తులను చూచినగాని వారు సిద్ధులని ప్రజకుతట్టదు. కొందరు సిద్ధుల జీవితములలో నట్టి మాహాత్మ్యములు జరుగుటయు కలదు. సిద్ధుడు వాటికి విలువ నివ్వడు. మాహాత్మ్యములుచేయుట సిద్ధిలక్షణము కాదు. అలౌకికశక్తులు సాధారణముగ ఆధ్యాత్మికాభివృద్ధి కడ్డుతగులును. వీనికి దూరముగానుండుడని గురువులందరును సాధకులకు చెప్పియేయున్నారు. "క్రూరజంతువులను విషసర్పములను వశపరచుకొనుట, బంగారముసేయుట, అదృశ్యులై సంచరించుట, నీటిపై నడచుట, నిప్పుమీద కూర్చుండుట, పరకాయప్రవేశము, శాశ్వతయౌవనముసాధించుట, దేవతలను దయ్యములను వశపరచుకొనుట, మొదలగు విద్యలసాధ్యములుకావు; మనస్సును వశపరచుకొని నిశ్చలముగానుంచుటే కష్ట"మని తాయుమానవర్ చెప్పియున్నాడు. అదే ధోరణిలో కాశ్మీరదేశపు సిద్ధురాలు లల్లేశ్వరికూడ, "ఓయోగీ, అగ్గిని చల్లబరచుట, ప్రవాహము నాపుట, తలక్రిందుగా నడచుట, ఎద్దుకు పాలుపితుకుట మొదలగు గారడీవిద్యలేల చేయగోరుదువు?" అని ప్రశ్నించుచున్నది.

సిద్ధులు మానవాతీతులని, సంఘమున కుపయోగపడరని, మామూలుకంటె భిన్నముగానుందురని, జీవితములో కష్టనిష్ఠురములు వారికి తెలియవని, కొందర పోహపడుదురు.

వారు గొప్ప ప్రపంచజ్ఞానముకల్గి తోడిమానవులసేవ ఉత్సాహముతో చేయుట చూచుచునే ఉన్నాము. "సమాధిలో వారు సంపాదించినది ప్రీతిపూర్వకముగా నితరులకు పంచిపెట్టవలసినదే" అని ఎఖార్టు (Eckhart) వ్రాసినాడు. సుగుణములకు కరుణ రాణివంటిది. ప్రపంచపదార్థములను సిద్ధులు రెండు చేతులతోను పంచిపెట్టుదురు. ఎవరైనను తమ అంగీ తీసుకొనిన కోటుకూడ ఇచ్చివేయుదురు. సాంఘికసేవ కుపయోగపడునట్లు తమ్మొనర్పుమని సిద్ధులెందరో భగవంతుని ప్రార్థించియున్నారు. భగవంతుడు దేవాలయములో గర్భగుడిలోమాత్రమే కాదు, కూలివాడు రోడ్డువేయుటకు రాళ్లు బద్దలుకొట్టుచున్నచోటకూడ ఉన్నాడని వారెరుగుదురు. "భగవంతుడు కుండలమధ్య దాకలమధ్యకూడ సంచరించు" నని థెరసా అను సిద్ధురాలు చెప్పినది. సిద్ధుల ప్రేమ ఒక్క మానవలోకముమీదనేకాదు, సమస్తప్రాణి లోకముపైనను విస్తరించును. ఆవును కొట్టిన దెబ్బలు బహినాబాయ్, తుకారాముల వీపులమీద కనబడెను. వారియెదుట స్థావరములు కూడ చైతన్యవంతములు, భగవత్పూరితములగును. జ్ఞానియగు కవి భారతి పక్షులతోనేగాక గిరి సాగరములతోకూడ బంధుత్వము కలుపుకొనెను.

మామూలుగా మనము చూచునట్టి సాంఘికసేవ కాదు వారు చేయునది. ప్రాణులలో అంతర్గతమైన భగవంతుని సేవ వారొనరింతురు. సర్వత్రా భగవంతుడు వ్యాపించి ఉన్నాడను జ్ఞానముతో వారు సేవచేయుదురు. భగవంతుడే సిద్ధుని జీవితమునకు కేంద్రము. అతడు భగవంతునిలోనే

పుట్టి పెరిగి లీనమగును. సిద్ధుడొనరించు పనియంతయు భగవంతునిగూర్చియే. ఇది ప్రతిసిద్ధుని జీవితములోను కానవచ్చును. సాకారబ్రహ్మను పూజింపని సిద్ధులుకూడ ప్రతి వస్తువులోను భగవంతునే చూతురు. భగవత్ప్రేమవల్లను, సర్వత్రా నిండియున్న భగవద్వికాస దర్శనమువల్లను, వారు ప్రపంచసేవకు పూనుకొందురు. సిద్ధుని హృదయమున భగవత్ప్రేమ నిండి నిబిడీకృతమగుటచే ద్వేషమున కక్కడ తావు లేదు. సూఫీ కవయిత్రి రబియా నొకసారి, "నీవు భగవంతుని ప్రేమింతువా?" అని ఒక రడిగిరి. వెంటనే 'ఔ'నని ఆమె పల్కెను. "నీవు సైతానును ద్వేషింతువా?" అని తిరిగి అడిగిరి. వెనువెంటనే ఆమె, "భగవంతుని ప్రేమ సంపూర్ణముగా నాలో నిండిపోవుటచే మరొకరిని ప్రేమించుటకు గాని, ద్వేషించుటకుగాని అవకాశములే"దని చెప్పెను.

సిద్ధుని భగవత్ప్రేమ సాధారణముగా పిచ్చియని యనుమానింపబడును. కాళికాదేవియందలి రామకృష్ణుని ప్రేమను పిచ్చిగాదలచిరి. పెండ్లిచేసిన పిచ్చి కుదురునని బంధువులు తలంచిరి. పెండ్లితో అది తగ్గలేదు సరికదా ఇంకను హెచ్చిపోయెను. శుష్కపండితుడు సిద్ధుని మనోదౌర్బల్యముగల యపురూప వ్యక్తిగా భావించును. మానసిక పరీక్షలజేసి సిద్ధుని పరిశీలింపలేము. సిద్ధుడనగా పిచ్చివాడైన యెడల, ఆపిచ్చే అందరు కోరదగిన మహా వరమగును.

సంపూర్ణసత్యమును సిద్ధు డన్వేషించును. సంకుచితత్వమునుండి విమోచనముగోరును. కవయః సత్యశ్రుతః అని వీరిని గూర్చి వేదములు చెప్పియున్నవి. వారి నిలకడ సత్య

మందు; వారుచూచునది గొప్పదగు సత్యము; వారు కను గొన్నది సత్యమార్గము. “కోరికలనుండి విముక్తుడైనవాడు, మంచి చెడ్డలను మించినవాడు, నిష్కళంకుడు, బ్రహ్మైక్య భావమువల్ల అమరత్వమందినవాడు సిద్ధు” డని ఉపనిషత్తులు చెప్పుచున్నవి (మాండూక్యోపనిషత్తు III 1, 3). దుష్ట త్వము విడువనివానికి, నిదానములేనివానికి, ఏకాగ్రతలేని వానికి, మనస్సమాధానము లేనివానికి జ్ఞానమబ్బదు. అతడు ఆత్మను చేరలేడని కఠోపనిషత్తు చెప్పుచున్నది.

సిద్ధుని ఆదర్శస్థితిని భగవద్గీత మరల మరల వర్ణించి చెప్పుచున్నది. స్థితప్రజ్ఞుడు గుణాతీతుడు, బ్రహ్మభూతుడు, ఆత్మయందే రమించును. రాగములకంటడు, నిష్కామి, సమలోష్టకాంచనుడు, ద్వంద్వాతీతుడు, అహంభావ శూన్యుడు, నిరంతరభగవద్ధ్యానపరుడు, అందరియెడల దాక్షిణ్యము సఖ్యము కల్గియుండును. నిత్యసంతుష్టుడు. అతని వల్ల ప్రపంచమునకు, ప్రపంచమువల్ల అతనికి బాధలేదు. అతడు పవిత్రుడు, అప్రమత్తుడు, నిస్సంకోచి.

సమత్వముకలవాడు యోగి. యోగి స్వభావము సంస్కారయుక్తము. అందరిలోనున్న ఆత్మయు నతడే. సర్వత్రి ఆత్మను, ఆత్మలో సర్వమును అతడు దర్శించును. బ్రహ్మ సాక్షాత్కారము పొందినవాడే సిద్ధుడు. సిద్ధపురుషులగూర్చి రామచరిత మానస్‌లో తులసీదాస్ రామునిచే ఇట్లు పలి కించుచున్నాడు, “వారు విషయసుఖములగోరరు; సరళ స్వభావులు, సుగుణాకరులు, ఇతరులసుఖదుఃఖముల పాల్గొం దురు. సమచిత్తులు – వారికి విరోధులులేరు. డాంబికము,

అహంకారము, భయము, స్వార్థము, పేరాశ, వారికి లేవు. కోమలహృదయులు. త్రికరణముల నన్నే భజింతురు. ఇతరు లను గౌరవించుచు తా మణకువతోనే ఉందురు. సజ్జనత్వము. అమాయికత్వము, సుహృద్భావము, భక్తి గల వానిని నిజ మైన సిద్ధునిగా దెలుసుకొమ్ము. వారి మనోనిగ్రహ మెన్నడు సడలదు. పరుషవాక్యములు పల్కరు. దూషణ భూషణ ములు సమముగా చూతురు. నా పాదపద్మములే తమ ధన ముగా భావింతురు. అట్టి సిద్ధులు నాకు ప్రాణతుల్యులు.''

సిద్ధపురుష లక్షణములన్నియు ఈ పుస్తకములో కన్పించును. దేశ కాలములచే సిద్ధులు భిన్నులైనను ఒకే పరమాత్మకు వారు సాక్షులు. అన్ని ప్రాణులలోను ఒకే ఆత్మ కలదన్నది వారు కనుగొన్న మహాసత్యము. ఈ సత్యమునే సిద్ధులందరు బోధింతురు. విలియం జేమ్సు ఇట్లు చెప్పియున్నాడు, ''పరమాత్మనుగూర్చిన బోధన లన్నియు సమానమే. పరమార్థ గ్రంథములకు జన్మస్థాన మనిగాని జన్మదినమనిగాని లేదనవచ్చును. భగవంతునికి మనుష్యునకుగల యవినాభావసంబంధమును దెలుపు నీ బోధలు భాషల పుట్టుకకుపూర్వముకూడ నున్నవి. అవి యెన్నటికిని పాతబడవు.''

# తిరుజ్ఞానసంబంధర్

సిద్ధపురుషులలో బాల్యముననే జ్ఞానముపొందినవారరుదు. వయస్సు ముదిరిన మీదటే దైవభక్తి, దైవదర్శనము లభించుట చూచుచున్నాము. భగవంతుని కనుగొనుట ఒక్కదినములో జరుగు పని కాదు. చిరకాలసాధన కావలెను. సరియైన మార్గము దొరకకకూడ కాలహరణమగును. కొందరివిషయములో మాత్ర మపురూపముగా ఒక్కయంగలో ఆత్మదర్శనము లభించుటయు కలదు. తిరుజ్ఞానసంబంధర్ జీవిత మట్టిది. సమయాచార్యు లనబడు శైవమతబోధకులు నలుగురిలోను సంబంధ రొకడు. ఈయన జన్మించి యిప్పటికి 1300 సంవత్సరము లయ్యెను.

దక్షిణాదిని శైవమత ప్రమాణ గ్రంథముల నేర్చి కూర్చి పండ్రెండుగా నంబియాండార్ నంబి సంపుటీకరణము చేసెను. మొదటి యేడు గ్రంథములలోను తిరుజ్ఞానసంబంధర్, తిరునావుక్కరసు, సుందరరుల తేవారము లనబడు కీర్తన లున్నవి. ఒక్క తిరుజ్ఞానసంబంధర్ కీర్తనలతోనే మొదటి మూడు గ్రంథములు నిండిపోయినవి. పండ్రెండవ గ్రంథమును పెరియపురాణ మందురు. దీనిని చోళరాజమంత్రియగు శేక్కిలార్ రచించెను. దీనిలో అరువదిముగ్గురు నాయన్మారుల జీవితములున్నవి. ఇందు రెండవ అధ్యాయములో ఆరవ ప్రకరణమున సంబంధర్ జీవితమున్నది. సంబంధర్ను

గూర్చి సుందరర్, నంబియాండార్ నంబియుకూడ తమ తమ గ్రంథములలో పేర్కొని స్తుతించియున్నారు.

సీర్ కాళీ, కుంభకోణమునకు సమీప గ్రామము. ఇందు శివపాదహృదయర్, భగవతీయార్ అను దంపతు లుండిరి. వారు చేసిన చిరకాల శివపూజ, సాధుసేవ పండెను. వారి కడుపున తిరుజ్ఞానసంబంధర్ జన్మించెను. అతని మూడవ యేట తండ్రి ఒకనాడు దేవాలయపు కోనేరుకు స్నానమునకు బోవుచు కొడుకునుకూడ వెంట తీసుకువెళ్లెను. గట్టుమీద బిడ్డని కూర్చుండబెట్టి, నీళ్లలో మునిగెను. తండ్రిని గానక, బిడ్డడు దేవాలయ శిఖరమువైపు ముఖముపెట్టి గట్టిగా నేడువ సాగెను. పార్వతీపరమేశ్వరులు ప్రత్యక్షమైరి. పాలిచ్చి ఊరడింపుమని పార్వతికి పరమేశ్వరుడు చెప్పెను. బంగారు గిన్నెలో స్తన్యము నింపి పార్వతి సంబంధర్ కిచ్చెను. అది త్రాగగానే సంబంధర్‌కు జ్ఞానోదయమయ్యెను. నోటినుండి పాలచుక్కలు కారుట చూచి తండ్రి బిడ్డ డే జాతి స్త్రీ పాలో త్రాగెనని కోపగించి కొట్టబోయెను. గుడిపైన ఆకాశము చూపుచూ అర్ధనారీశ్వరుడు తన్ననుగ్రహించినా డని సంబంధర్ సంతోషము పట్టలేక గానము చేసెను. తండ్రి మనస్సింకను పరిపక్వము కాకపోవుటచే నతడు పార్వతీపరమేశ్వరులను చూడలేకపోయెను. సంబంధర్ గుడిలోనికి వెళ్లెను. వెంట తండ్రి ఇతర ప్రజలు గుంపులుగా వెళ్లిరి. పది కీర్తనలు పరమేశ్వరునిగూర్చి సంబంధర్ పాడెను. ఆనందముతో బిడ్డని భుజములమీద ఎక్కించుకొని శివపాదహృదయర్ ఇల్లు జేరుకొనెను.

తిరుజ్ఞానసంబంధర్ అను పేరే అతనికి గల్గిన జ్ఞానోదయము సూచించుచున్నది. దివ్యజ్ఞానముతో సంబంధము కలవాడని దాని అర్థము. నిరంతరము భగవద్బోధ సేయుచు, శివకీర్తనలుపాడుకొనుచు, తమిళనాడునగల శివక్షేత్రములన్నింటిని నతడు దర్శించెను. తండ్రికూడ అతనితో పోవుచుండెను. సంబంధర్ వెళ్లినచోటనెల్ల ఏదో ఒక మాహాత్మ్యము జరుగుచునే ఉండెను. అది భగవంతుని కృపాసూచకము గాని తనప్రభావము గాదని యతడెరుగును. ఆ పిల్లవాని ద్వారా, శివుడు ప్రజల హృదయములలో భక్తివిశ్వాసములు రేకెత్తించెను.

పాడుచూ, దానికనుగుణముగా చేతితో తప్పెటలు వేయుట సంబంధర్ పద్ధతి. అందుకై పంచాక్షరీమంత్రము చెక్కిన బంగారు తాళములు భగవంతుడు సంబంధర్ కనుగ్రహించెను. సంబంధర్ పాటలు తన తంబురాపై వాయించుచు తిరునీలకంఠయాల్పానర్ అను భాగవతుడు ఆరంభమునుండి సంబంధర్‌తో సంచారము చేయసాగెను. చిదంబరములో దీక్షితరులు మూడువేలమంది శివగణముల వలె సంబంధర్‌కు దర్శనమిచ్చిరి. కాలినడకనో, తండ్రి భుజములమీదనో, సంబంధర్ ప్రయాణము సాగించుచుండెను. తిరునెల్వాయిల్ అరత్తురై వద్ద శివానుగ్రహము వల్ల సంబంధర్‌కు ముత్యాలపల్లకీ, ధవళచత్రము, శంఖములు బహుమానముగా లభించెను. దీనికర్థ మాధ్యాత్మికాచార్య పదవి నా బిడ్డ డందుకొనెనన్నమాట. అప్పటినుండి రాజలాంఛనములతో సంబంధర్ భగవంతుని గొప్పతన

మనుగూర్చి పాడుకొనుచూ ప్రయాణము సాగించుచుండెను. తిరుచ్చెనలూర్‌లో పూర్వముండిన చండీశ్వర నాయనార్ పవిత్రభక్తినిగూర్చి అచటి దేవాలయములో సంబంధర్ గానముచేసెను. దారిలోని క్షేత్రములు దర్శించుకొనుచూ స్వగ్రామమునకు తిరిగివచ్చిన సంబంధర్‌కు ఊరివారెల్ల ఘనస్వాగతమిచ్చిరి. ఆ ఊరేగింపులో నతని తల్లి ముందు నడచెను.

లాంఛనప్రాయముగా సంబంధర్ కుపనయనము చేసిరి; ఇదివరకే అతనికి జ్ఞానము సిద్ధించెనుగదా! ఉపనయనము చేయింపవచ్చిన పండితు లతనికి బోధించుటకుబదులు, తామే అతనివద్ద శాస్త్రవిషయములు నేర్చుకొని వెళ్లిరి.

నలుగురు సమయాచార్యులలోను అప్పర్ అనబడు తిరునావుక్కరసు ఒకరు. అప్పరీ బాలమహాత్ముని గూర్చి విని చూడగోరి సీర్‌కాళీ వచ్చెను. సంబంధర్ ఎదురేగి పెద్దవాడగు అప్పర్‌ను గౌరవించెను. వారొకరి నొకరు గాఢముగా ప్రేమించుకొనిరి. ఇద్దరును కలిసి శివక్షేత్రముల దర్శించిరి. అచటి భక్తులు వీరి దర్శనసాంగత్యభాగ్యముచే కృతార్థులగుచుండిరి.

ఈ సారి సంచారములో తిరుప్పాచ్చిలాచ్చిరమమువద్ద సంబంధర్ ఒక మాహాత్మ్య మొనరించెను. ఆ ఊరు జమీందారు కుమార్తె జబ్బు నెవరును కుదర్చలేకుండిరి. శివభక్తుడగు ఆ జమీందారు తనకూతును శివలింగము ముందు పరుండబెట్టి, రక్షింపుమని సంబంధరును వేడుకొనెను. ఆ పిల్లను కాపాడుమని భగవంతుని కీర్తించుచు సంబంధర్

గానము చేసెను. అబ్బురముగా ఆ బిడ్డ పూర్ణారోగ్యవతి యయ్యెను.

పిదప కావేరీనది, కొంగు ప్రాంతముల సంబంధర్ శీతకాలమున సంచారముచేసెను. ఆ ప్రాంతమును చలి జ్వరము పీడించుచుండెను. ప్రజలు మొరపెట్టగా సంబంధర్ ఒకగీతము నిట్లు పాడెను: "కర్మబద్ధులారా, మిమ్ముల రక్షించు పుణ్యకార్యము లేల చేయరు? భగవంతుని పాద పద్మములు భజింపుడు. నీలకంఠుని కృప మన కర్మబంధముల త్రుంచివేయును." దానితో జ్వర మా ప్రదేశముల మటు మాయమయ్యెను. దక్షిణదిక్కున సంచారముచేయుచు ఎండాకాలమునకు సంబంధర్ తిరుపట్టీశ్వరము చేరుకొనెను. శివుని మాహాత్మ్యమున సంబంధరు కెండ తగులకుండా ముత్యముల మేలుకట్టు లభించెను. నాటినుండి భక్తులాయనకు దాని నీడ పట్టుచుండిరి.

ఇంతవరకు కుమారునితోనే సంచారముచేయుచున్న శివపాదహృదయర్ స్వగ్రామమునకువెళ్లి యాగ మొకటి చేయ సంకల్పించెను. కాని ధనమేది? సంబంధర్ దేవాలయ ములోనికి బోయి, "కష్టములందును దార్బల్యమునందును, బాధలమధ్యను నీ పాదములే నే భజింతును," అని పాడగానే దేవదూత యొకడు వెయ్యి బంగారు నాణెములు తెచ్చి యిచ్చెను; వానిని తండ్రి కిచ్చి స్వగ్రామమునకు పంపెను.

తరువాతకూడ ఎన్నో మాహాత్మ్యములు జరిగెను. పాము కాటువల్ల చనిపోయిన ఒకవర్తకుని సంబంధర్ బ్రదికించెను. కావేరీ జిల్లాలో కరువు తాండవించుచుండెను. శివాజ్ఞ

ప్రకారము ప్రతిదినము సంబంధర్, అప్పరులు దేవాలయ మునకు బోయి శివకృపచే నచట కావలసినంత ధనము లభించుచుండుటచే తెచ్చి కాటకపీడితులగు ప్రజలకు పంచి పెట్టుచుండిరి. వర్షములుపడి, కరువు తొలగినవరకు వారట్లు చేసిరి. తిరుమరైక్కాడువద్ద సదా మూసుకొనియుండు శివాలయ సింహద్వారమును అప్పరు ఒక కీర్తన పాడి తెరిపించెను. మరల సంబంధర్ ఒక పాట పాడి మూసు కొనునట్లు చేసెను.

మరికొందరు సిద్ధులను సంబంధర్ యీ కాలముననే దర్శించెను. తిరునల్లూరులో తిరునీలనక్క నాయనార్‌ను సందర్శించెను. శిరుతొండ నాయనార్ ఆహ్వానముమీదట తిరుచ్చెంగాట్టంగూడి వెళ్లి అచట గణపతీశ్వర దేవాలయ ములో ఒక కీర్తన పాడెను. తిరుప్పుగలూర్ వద్ద మురుగ నాయనార్‌ను కలుసుకొనెను.

పాండ్యరాజ్య ప్రధానపట్టణమగు మధురను దర్శించుట సంబంధర్ జీవితములో నొక ముఖ్యావిశేషముగా చెప్ప వచ్చును. అతని రాకతో మధురలో శైవమతపునరుద్ధారణ జరిగెను. మధురలో జైనుల ప్రభావము హెచ్చుగా నుండెను. జైనులు రాజును, రాజునుబట్టి చాలమంది ప్రజలను తమ మతములోనికి మార్చివేసిరి. రాణియు, మంత్రియు మాత్రము శైవమతమును వీడక, తమ మతోద్ధరణకొరకు భగవంతుని ప్రార్థించుచుండిరి. వారు సంబంధర్ ఘనతగూర్చి విని, మరైక్కాడులోనున్న సంబంధరుకొఱకు దూతలను బంపిరి. కాని బాలుడగు సంబంధరును జైనులేమిచేయుదురో అని

అప్పరుకు భయముగా నుండెను. గ్రహస్థితి బాగుండలేదు, వెళ్లవద్దనికూడ వారించెను. శివానుగ్రహమున్న నే చేటును మూడదనుచు సంబంధ రిట్లు పాడెను: "బాలేందుమౌళి, నీలకంధరుడు, గంగాధరుడు వీణాపాణి పార్వతిం గూడి నా హృదయము నాక్రమించియుండగా, నవగ్రహములు భక్తుల కనుకూలములేగదా". అప్పరును చోళరాజ్యము ననే నిలిపి తాను పాండ్యరాజ్యమునకు పయనించెను.

మంత్రి సంబంధరు కెదురేగి, రాణి వేచియున్న శివాలయమునకు తీసుకువెళ్లెను. శివుని కీర్తించి, రాణి నోదార్చి, సంబంధర్ తన విడిది కేగెను. శివయోగి వచ్చు టెరిగి జైనులు రాజుతో తమమంత్రప్రభావమువల్ల సంబంధ రున్న విడిదిని కాల్చివేయుదుమని ప్రజ్ఞలు పలికిరి. మంత్ర తంత్రములు పనిచేయలేదు. చివరకు విడిదికి నిప్పంటించిరి. భక్తులు మంటలనార్పి సంబంధరు కా విషయము దెల్పిరి. "జైను లంటించిన యగ్ని నెమ్మదిగా రాజు నలముకొనుగాక" అని సంబంధరు పల్కెను. రాజు ఒడలు జ్వరముతో మండి పోసాగెను. మందులకుగాని జైనుల మంత్రములకుగాని మంటలు తగ్గలేదు సరిగదా హెచ్చిపోయెను; భరింపలేక రాజు జైన గురువుల కసరిగొట్టెను.

రాణియు, మంత్రియు రాజువద్దకువచ్చి జ్వరము తొలగింపగలవా డొక్క సంబంధరే అని చెప్పి అతనికి కబురంపుటకు రాజు నొప్పించిరి. సంబంధర్ పేరు చెవిని పడగానే రాజు తాపము కొంత తగ్గెను. వారి ఆహ్వాన మందుకొని, సంబంధర్ ముందు దేవాలయమునకుబోయి

రాజుపై కృప చూపుమని శివుని కీర్తించి, పిదప రాజువద్దకు వచ్చెను. సంబంధరే కాదు మేముకూడ కుదర్చగలమని జైనసన్యాసులు రాజువద్దకు తయారైరి. చివరకు రాజు ఎడమభాగము జైనులు, కుడిభాగము సంబంధర్ కుదుర్చుటకు రాజీపడిరి. మొదట జైనులు ప్రయత్నించిరి. ఎడమ ప్రక్క మంటలు హెచ్చసాగెను. పిదప సంబంధర్ శివుని ప్రార్థించి, విభూతిని కీర్తించుచు, రాజు కుడిభాగమునకు విభూతి నద్దెను. జ్వర మా భాగము వీడి రెండవభాగమునకు పోవుటచే ఎడమప్రక్క బాధ తీవ్రమయ్యెను. జైను లోడిరని రాజు నిర్ణయించి సంబంధరునే ఎడమవైపుకూడ బాగుచేయు మని కోరెను. శివనామ ముచ్చరించుచు సంబంధర్ ఆ ప్రక్కకూడ విభూతి నద్దెను. దానితో రాజు పూర్తిగా బాగుపడెను.

జైనులు సంబంధరును మరి రెండు పరీక్షలకు గురి చేసిరి. మొదటిది అగ్నిపరీక్ష. తన కీర్తన నొకటి సంబంధరు తాటాకుపైన వ్రాసి మంటలో వేసెను. ఆ మంటలోనే జైనులు తమ మతసిద్ధాంతముల నొక తాటాకుపై వ్రాసి పడవేసిరి. జైనుల తాటాకు బూడిదయ్యెను; సంబంధరుది యథాప్రకారము పచ్చిగానే ఉండెను. రెండవది జలపరీక్ష. జైనులు తమ సిద్ధాంతములుగల తాటాకును వైగై నదీ ప్రవాహములో వేసిరి. సంబంధర్ తన కీర్తనల తాళపత్ర మా నదిలోనే వేసెను. జైనుల తాటాకు ప్రవాహములో కొట్టుకొనిపోయెను; సంబంధరుది ప్రవాహమున కెదురీదెను. ఇట్లు శైవమతమున కఖండవిజయము లభించెను. రాజు,

ంతసితో పాటు విశేషజనము, తిరిగి శైవమత మవలంబించిరి.

తన కుమారుని దిగ్విజయయాత్ర చూచుటకు ంబంధరు తండ్రి మధురకు వచ్చెను. దక్షిణాదిని రామేశ్వరమువరకు సంబంధరు భక్తులతో పయనించెను. ఈ యాత్రలో ఒకచోట తనతోనున్నవారినందరిని నావికుడు లేని పడవలో వరదతోనున్న నదిని దాటించెను. మరొక చోట నొక బౌద్ధమతగురువును వాదములో నోడించెను. ురుక్కడప్పూర్ వద్ద అప్పర్ చాటుగావచ్చి బోయలలో ొకడుగా పల్లకీ మోయసాగెను; అది గ్రహించి సంబంధర్ ల్లకీదిగి అప్పర్ పాదములపై బడెను. అప్పరు సంబంధరుకు మస్కరించి యతని మధురాపుర విజయము కొనియాడెను. ంబంధరు స్వగ్రామము చేరుకొనెను. కాని ఎన్నాళ్లో క్కడ ఉండలేదు.

పిదప తొండై మండలములో సంచారమునకు ంబంధర్ బయలుదేరెను; తిరువన్నామలై మొదలగు నేక క్షేత్రములు దర్శించి తిరువొత్తియూరు చేరుకొనెను. చట నొక చిత్రము జరిగెను. ఒక శివభక్తుని తాటితోపు ోని చెట్లన్నియు గొడ్డులే. నాస్తికులతని దేవుడునపుంసకుడని యతనిని పరిహసించుచుండిరి. ఇది విని సంబంధర్ చెట్లు ాయలు కాయునట్లు చేయుమని భగవంతుని ప్రార్థించెను. తక్షణమే ఆ చెట్లకు పండ్లు కాసెను. దారిలో మరికొన్ని పట్ట ములు దర్శించి సంబంధర్ తిరువాలంగాడు చేరుకొనెను. చటనే కారైక్కాల్ అమ్మైయార్ శిరస్సుతో నడచినది. సలముచుట్టూ ప్రదక్షిణముచేసి అచటి శివలింగమును

నతడు కీర్తించెను. పిదప కాళహస్తికి వెళ్లి అచట కన్నప్పర్‌ను పూజించెను. అచటనుండి మద్రాసుకు చెంతనున్న తిరువొత్తియూర్ చేరుకొనెను.

ఆ కాలమున మైలాపూర్‌లో శివనేశన్ అను వర్తకు డుండెను. అతనికి పూంపావై అను కూతురు గలదు. సంబంధర్ ఘనత విని గాఢానురాగముతో నతనికి తన కూతునిచ్చి వివాహము చేయగోరుచుండెను. కాని దురదృష్ట వశాత్తు ఆమె పాముకాటువల్ల చనిపోయెను. కూతుని దహనముచేసి, ఆమె అస్థిక లొక కుండలో దాచి ఉంచు కొనెను. తిరువొత్తియూర్‌లో సంబంధర్ ఉన్నట్లు తెలుసు కొని వెళ్లి ఘనస్వాగతముతో మైలాపూర్ తీసుకువచ్చెను. పూంపావై సంగతి సంబంధర్ విని, కపాలేశ్వరుని పూజించి వచ్చి, అస్థికల కుండ తెప్పించి, ఒక కీర్తన పాడెను. వెంటనే కుండలోనుండి పూంపావై జీవములతో లేచివచ్చెను. ఆమెను పెండ్లాడమని శివనేశన్ సంబంధరును ప్రార్థించెను కాని ప్రాణదానముచేయుటబట్టి తాను తండ్రివంటివాడ నైతినని పెండ్లాడ నిరాకరించెను.

మైలాపూర్‌నుండి చిదంబరము చేరుకొనుసరికి తండ్రి సంబంధరునింటికి తీసుకొనివెళ్లుటకు వచ్చెను. ఇంటివద్ద సంబంధరు పెండ్లిప్రయత్నములు జరుగుచుండెను. మొదట యిచ్చగింపకున్నను తుద కతడు పెండ్లికిసమ్మతించెను. తిరు నల్లూర్‌లోని నంబియాండార్ నంబి కుమార్తె పెండ్లికూతురు. పెండ్లి అయిన పిమ్మట సంబంధర్ పెండ్లికూతును, పెండ్లికి వచ్చినవారి నందరిని శివాలయములోనికి తీసుకువెళ్లెను.

శివునిగూర్చి, "శివా, తండ్రివినీవే, తల్లివినీవే, నీపాదములు జేరుకొను సమయము నాకెరుదెంచె" నని స్తోత్రగానము సేయగానే ఆలయము కాంతితో నిండిపోయెను. శివు డాతని ప్రార్థన నాలకించెను. ఒక కాంతి శివజ్యోతులకడకు మార్గ మేర్పరచెను. తనతోనున్నవారితో సహా ఆజ్యోతులకు సంబంధర్ ప్రదక్షిణముసేసి, జ్యోతులలోనికి పోయి అంత ర్ధానమయ్యెను. ఆ మహాజీవిత మీవిధముగా మహా నిర్వా ణము పొందెను.

శైవసిద్ధాంత ప్రకారము ఆధ్యాత్మికసాధనలు నాలుగు విధములు. మొదటిది కార్యము. దేవాలయములను తుడు చుట, పూజకై పూవుల సేకరించుట మొదలగు బాహ్య పూజాసంబంధమైన కార్యములొనర్చుట. ఇది సేవకు డొనర్చు పనులుగాన దీనిని దాసమార్గమందురు. దీనిద్వారా భగవం తునిలోకముచేరగల్గుదురు; సాలోక్యప్రాప్తి గల్గును. రెండవది క్రియ. కుమారుడు తండ్రికిచేయు ఆప్తబంధు సేవవంటి సేవ భగవంతుని కొనర్చుట. అందుచే దీనిని సత్పుత్రమార్గ మందురు. దీనిద్వారా సామీప్యప్రాప్తి గల్గును. మూడవది యోగము. ధ్యానము, మానసికపూజ, మొదలగునవి చేయుట. దీనిని సఖ్యమార్గమందురు. దీనిద్వారా సామీప్య ప్రాప్తి కల్గును. నాల్గవది జ్ఞానము. జ్ఞానము వివేకము ఆధారములైన ఈ మార్గము అఖండశుభమిచ్చును. దీనిని సన్మార్గమందురు. దీనిద్వారా భగవంతునితో లీనముసేయు సాయుజ్యప్రాప్తి కల్గును. నలుగురు సమయాచార్యులును ఒక్కొక్క రొక్కొక్క మార్గమున కాదర్శపురుషులు.

వీనిలో రెండవదగు సత్పుత్రమార్గమునకు సంబంధర్
ఆదర్శ పురుషుడు.

దక్షిణాది శైవమత ప్రమాణ గ్రంథములలో మొదటి మూడును సంబంధర్ రచనలతోనే నిండిపోయినవని చెప్పితిమి. ఇందు 383 కీర్తనలున్నవి. ఈ కీర్తనలలో సంబంధర్ తాను దర్శించిన దేవాలయములగూర్చి, అందలి దైవములగూర్చి, ఆయాప్రదేశముల శుభలక్షణములగూర్చి పాడియున్నాడు. శైవపురాణగాథల నాధారముచేసికొని దేవుని సృష్టి స్థితి లయ శక్తులనుగూర్చి, దైవమాయగూర్చి, దైవజ్ఞానముగూర్చి తెలిపియున్నాడు. మానవుల కాపాడుమని, శివశక్తి తెలుపు మాహాత్మ్యముల నొనర్చుమని, దుష్ట శిక్షణ శిష్టరక్షణ లాచరింపుమని, భక్తుల కాధ్యాత్మికసిద్ధినిమ్మని, ఈ కీర్తనలలో సంబంధర్ భగవంతుని ప్రార్థించియున్నాడు. పశ్చాత్తప్తునివలెగాని, దూరస్థునివలెగానిగాక తండ్రిపై పుత్రునకుగల హక్కుతో భగవంతుని సంబంధర్ కీర్తించియున్నాడు.

# తిరునావుక్కరసు

నిజమైనమార్పు ఒక మతములోనుండి మరొకమతములో చేరినంతమాత్రమునరాదు. ఆధ్యాత్మికోన్నతిని కల్గించు హృదయపరివర్తనము కావలెను. మార్పు చెడుగు నుండి మంచివైపునకు కావలెను. జీవితములో ఏ పెద్ద గండములవల్లనో ఇట్టి మార్పు రావచ్చును. భగవంతుడే కొందరికి ఆపదలు కల్పించి భక్తులుగా మార్చి రక్షించుట కద్దు. తిరునావుక్కరసు ఈ కోవలోనివాడే. ఇతడు క్రీ॥ శ॥ ఏడవ శతాబ్దములోనివాడు. తిరుజ్ఞానసంబంధరుకు సమకాలీకుడు. సంబంధరు జీవితములో వీరిద్దరి దివ్యసాంగత్యముగూర్చి ముచ్చటించియున్నాము. బాలయోగియగు సంబంధరీయనను మొదటిసారి కలుసుకొన్నప్పుడు, "అప్పా" అని పిలుచుట చేతనే ఈయనకు అప్పర్ అను పేరుకూడ కలిగెను. తేవారములో మొదటి మూడు తిరుమరైలును సంబంధరువి, తరువాతి మూడును తిరునావుక్కరసువి. పెరియపురాణమున ఐదవ అధ్యాయములో ఈయన జీవితమున్నది. భగవదానంద మొక్కటే అప్పరుకు నిజమైన ఆనందమని సుందరర్ కూడ వ్రాసియున్నాడు. అప్పరు భాష శైవమతమున కలంకారమని నంబియాండార్ నంబి ప్రశంసించినాడు.

పుగలనార్ మాదినియారులను దంపతులు తిరువామూరులో నివసించుచుండిరి. వారికి తిలకవతియారను కూతు

రును మరుల్‌నీక్కియారను కొడుకునుగలరు. అతడే అప్పర్.
కలిప్పగై నాయనారను మహా శివ భక్తునకు తిలకవతియారు
నిచ్చి పెండ్లి చేయుటకు నిశ్చయమయ్యెను. అతడు సేనాధిపతి.
ఉత్తరదిశను దూరప్రాంతమున నొక యుద్ధమునకు బోయి
మరణించెను. ఇంతలో నామె తల్లిదండ్రులుకూడ మరణించిరి.
అందుచే ఆమె ఆత్మహత్యకు తలబెట్టెను. కాని తమ్ముని
దుఃఖము నిరాశ్రయస్థితిచూచి అతని కొఱకు ప్రాణములు
నిలుపుకొనెను. తుద కాతని ఆధ్యాత్మికజీవితముకూడ
ఆమెయే నిలబెట్టెను.

ఆ రోజులలో జైనమతము రాజపోషణగల్గి హెచ్చు
ప్రభావముకల్గియుండెను. అప్పరుకూడ జైనులవలలోబడి
ధర్మసేనుడను పేరుపెట్టుకొని జైనమతాధ్యయనము తీవ్ర
ముగా సాగింపజొచ్చెను. జైనమతవ్యాప్తికి పూనుకొనెను.
ఇదిచూచి దుఃఖముతో తిలకవతి సన్న్యాసినిగా నొక శివా
లయమునజేరి సేవచేయుచు, తమ్ముని మనస్సు మార్పుమని
శివుని ప్రార్థించుచుండెను. ఆమె ప్రార్థన శివు డాలకించెను.
అప్పరునకు కడుపులో విపరీతమైన నొప్పి కలుగజేసెను.
జైనస్వాములు మందులు మంత్రములు వాడిరి కాని నిష్ప్ర
యోజనమయ్యెను. నిరాశతో అప్పరు అక్కను చేరు
కొనెను. ఆమె అతనికి ధైర్యముచెప్పుచు, శివపంచాక్షరి
నుపదేశించి, విభూతి దేహమంతయుపూసి, దేవాలయమునకు
తీసుకువెళ్లెను. శివుని ముందు సాష్టాంగపడిన అప్పరునకు
కవిత్వము లోనుండి పుట్టుకొనివచ్చెను. పశ్చాత్తాపము వెలి
బుచ్చుచు నతడు తన మొదటికీర్తన పాడెను. పాపము

క్షమింపుమని, బాధలు తొలగింపుమని వేడుకొనెను. బాధ వెంటనే తొలగిపోయెను. అతనికి భగవద్వాణి తిరునావుక్కరసు అను క్రొత్తపేరు పెట్టెను. "దివ్య భాషాచక్రవర్తి" అని దాని కర్థము. నాటినుండి అతడు శివభక్తుడై, శివ కీర్తనలు పాడుకొనుచు, దేవాలయములందలి పనికిమాలిన మొక్కలను త్రవ్వి పారవేసి శుభ్రముచేయుటకు చేత నొక త్రవ్వుకోల నెప్పుడు ధరించి సంచారము చేయుచుండువాడు. తమ్మునిలో కల్గిన పరివర్తన కక్క అపరిమితానందము పొందెను.

తమచేతులలోనుండి తిరునావుక్కరసు దాటిపోయినందుకు జైనులు పగబట్టిరి. అతడొక్కడు పోయినయంత బాధలేదుకాని అతడు వెళ్లిపోయిన పరిస్థితులు జైనమతమునకే దెబ్బగా వారికి తోచెను. వారుతమ రాజకీయ ప్రభావ ముపయోగించి, కాంచీపుర పల్లవ రాజునకు చాడీలు చెప్పి యతనిని రాజు వద్దకు పిలిపించిరి. కడుపు నొప్పియను దొంగవేషమున అక్క ఒత్తిడివల్ల వెళ్లిపోయెనని వారు రాజుతో కల్లలాడిరి. దూతలువెళ్లి తిరునావుక్కరసుతో రాజాజ్ఞయైనది రమ్మని చెప్పగా తాను రాజునకు బానిసనుకానని యు, తనకు మృత్యుభయము లేదనియు, రానని యు పల్కెను. రాజాగ్రహమునకు భయపడి దూతలు దీనముగా వేడుకొనగా, వారిపై జాలిగొని యతడు బయలు దేరెను. జైన ప్రోద్బలమున రాజు హిరణ్యకశిపునివలె అతని ననేకవిధముల జంప యత్నించెను. అతనిని సున్నపుబట్టీలో త్రోయించెను. కాని తిరునావుక్కరసు శివుని పాదముల

చల్లదనమును, వెన్నెలతోను దక్షిణానిలముతోను. వసంతోదయముతోను, పూల సరోవరముతోను ఇంకను ఎన్నెన్నో దృష్టాంతములతో పోల్చి పాడసాగెను. బట్టీ అగ్గి పొగ లతని నేమియు చేయలేదు. అతనిచే విషము త్రాగించిరి. లోకరక్షణకై హాలాహలము మ్రింగిన శివుని భక్తుని విష మేమి చేయగలదు? అతనిని చంపుటకు మదపుటేనుగును పంపిరి. అది తొండమెత్తి నమస్కరించి అతనికి ప్రదక్షిణముచేసి జైనులపై తిరుగబడెను. వారు చెల్లాచెదరై పారి పోయిరి. శిల మెడకుగట్టి యతనిని సముద్రములో త్రోయించిరి. శిల బెండై తేలెను. త్రాళ్లు తెగిపోయెను. అన్ని ఆపత్తులలోను నమశ్శివాయ మంత్రము రక్షింపగలదని తిరునావుక్కరసు అప్పుడే పాడెను. సముద్రములో తేలి సురక్షితముగా ఒకరేవుచేరెను. అచటి శివభక్తు లతనికి గొప్ప స్వాగతమిచ్చిరి. అచటి శివాలయమునకేగి, నిన్నే నమ్ముకొన్న భక్తుడనని శివుని కీర్తించెను. పల్లవరాజు, మహేంద్రవిక్రముడు, పశ్చాత్తాపముతో తిరువదిగై వద్ద అతని పాదములపైబడి క్షమాపణ వేడెను. తిరునావుక్కరసు అతనిని దీవించెను. తనతప్పిదము గుర్తించుకొన్న రాజు తిరిగి శైవుడై తమిళనాడున శైవమతోద్ధరణముచేసెను.

తిరునావుక్కరసు తన జీవితశేషమును శివసేవలో గడిపెను. శివకీర్తనలు పాడుకొనుచు, శివాలయములన్నియు దర్శింపసాగెను. తన త్రవ్వకోలతో శివాలయ ప్రాంగణములు పరిశుభ్రముచేయుచుండెను. అతనిద్వారా అనేక మాహాత్మ్యములు జరుగుచుండెనుకాని వాని నన్నింటిని భగవంతుడే

చేయుచున్నాడనియు, తాను రక్షింపబడుటయు, శివమహిమ ప్రచారముచేయుచు తాను సంచారముచేయగల్గుటయు భగవత్కృపవల్ల కల్గిన మాహాత్మ్యములే అని అతడు భావించుచుండెను. తిరుప్పెణ్ణాకటంవద్ద అతడు తన చేతులపై త్రిశూల నందిముద్రలు వేసి తన్ను పవిత్రునిచేయుమని శివుని ప్రార్థించెను. ఒక దేవదూతవచ్చి అట్లే చేసెను. అచటనుండియే తిరునావుక్కరసు బాలయోగియగు తిరుజ్ఞాన సంబంధరును కలుసుకొనుటకు సీర్‌కాళీ వెళ్లెను.

చోళరాజ్యమందలి శివాలయము లన్నింటిని దర్శించు కోరికతో నతడు బయలుదేరెను. తిరుక్కోలక్కా వరకు సంబంధర్ కూడ అతనితో ప్రయాణముచేసెను. తిరుచ్చత్తి ముత్రం చేరినపు డతనికి శివుడు తన శిరస్సుపై పాదములుంచి తన్ను కృతార్థుని చేయవలెనను కోరికపుట్టెను. నల్లూరు వెళ్లుమని శివాజ్ఞలభించెను. నల్లూరు ఆలయమున సాష్టాంగ ప్రణామముచేసి లేచుచుండగా శివుడు తన పాదము లతని తలపై నుంచెను.

తింగలూర్‌లో అప్పూదియడిగళ్ అను భక్తుడు తిరునావుక్కరసు గొప్పతనము విని అనురాగముతో నతని పేరు తనబిడ్డలకు, తాను స్థాపించిన సంఘసేవాసంస్థలకు, తనకుసంబంధముకలవాని కన్నింటికి పెట్టెను. తిరునావుక్కరసు తింగలూరులో అప్పూదియడిగళ్ ఇంటికి విందునకు వెళ్లెను. అరటాకులు తెచ్చుటకు పోయిన అప్పూదియడిగళ్ కుమారుని పాము కరచెను. విందునకు విఘ్నము కల్గునని ఆ వార్త తండ్రి తెలియనీయకున్నను, తిరునావుక్కరసు గ్రహించి మృతబాల

దేహము దేవాలయములోనికి తెప్పించి, శివుని కీర్తింపగా, పిల్లవాడు ప్రాణములతో లేచెను. కొన్నాళ్లు అప్పూదియడిగళ్ ఇంట నుండి, తిరిగి బయలుదేరి మదుసటి మకాములో అప్పూదియడిగళ్ పవిత్రభక్తినిగూర్చి అప్పర్ గానముచేసెను.

నల్లూరులో కొన్నాళ్లుండి, తిరువారూర్ వెళ్లి అచట చాలా కీర్తనలు రచించెను. అచటి ఆర్ద్ర ఉత్సవముచూచి పులకాంకితుడయ్యెను. తిరుప్పుగలూర్ వద్ద సంబంధర్ను కలుసుకొన్నప్పుడా ఉత్సవశోభ తన అనుభవము లాతనికి తెల్పెను. తిరువారూర్ సంబంధర్ వెళ్లివచ్చులోగా తిరునావుక్కరసు చుట్టుప్రక్కల కొన్ని దేవాలయములు దర్శించి వచ్చెను. కొన్నాళ్లు మురుగనాయనార్ మఠములో వీరిద్దరితో పాటు శిరుత్తొండనాయనారు, తిరునీలనక్క నాయనార్లుకూడ ఉండిరి. పిదప సంబంధరు తిరునావుక్కరసు కలిసి సంచారముచేసిరి. ఈ సంచారములోనే కావేరీ డెల్టా కరువు తీర్చుట కిద్దరును జనులకు తిండిపెట్టినది. ఆ వెనుకనే తిరుమరైక్కాడు శివాలయ సింహద్వారమును అప్పర్ తెరిపించుట, పిదప సంబంధర్ మూయుటయు జరిగినది.

అప్పర్ చాలసేపు ప్రార్థించిననేగాని ద్వారము తెరుచుకొనలేదు. సంబంధర్ ప్రార్థింపగా నేమియు ఆలస్యములేక వెనువెంటనే మూసుకొనెను. దీనిభావము తెలియక అప్పరు కొంత నిరుత్సాహపడెను. శివుడు కనిపించి తనవెంట అప్పరును తిరువాయ్మూర్ రమ్మనెను. కొంతదూరము తీసుకువెళ్లి శివుడొక దేవాలయము అప్పరుకు చూపించి దానిలోనికి తాను పోయి అంతర్థానమయ్యెను.

అప్పరు దేవాలయములోనికి వెళ్లుసరికి సంబంధరుకూడ అచ్చటికి చేరుకొనెను. నీ ప్రియపుత్రుడగు సంబంధరుకైనను దర్శనమిమ్ము అని అంతర్హితుడైన శివుని అప్పరు ప్రార్థించెను. సంబంధరు శివుని దర్శించి అప్పరునకుకూడ చూపించెను. ఇద్దరును కలిసి తిరువాయ్మూరు వెళ్లి తిరిగి తిరుమరైక్కాడు చేరుకొనిరి.

ఇక్కడ నుండగనే మధురనుండి దూతలు వచ్చి తమ రాజును ప్రజలను తిరిగి శైవమతమునకు మార్చుటకై సంబంధరును తీసుకువెళ్లినది. తిరిగి అప్పరు సంచార మారంభించెను. తిరుప్పళైయారైలో వడతలి దేవాలయ మందలి శివలింగమును జైను లెచటనో తెలియరాకుండ పాతిపెట్టిరి. అది విని అప్పరు శివలింగ పునఃస్థాపనవరకు తిండి తిననని దేవాలయములో దీక్ష వహించెను. శివుడు రాజు కలలో కనిపించి లింగ పునఃస్థాపన కాదేశమిచ్చెను. రాజు అప్పరును క్షమాపణ వేడుకొని శివాజ్ఞప్రకార మొనరించెను.

తిరుప్పైజ్ఞీలివద్ద మరొక మాహాత్మ్యము జరిగెను. అప్పరునకు విపరీతపు ఆకలిదప్పులు కల్గెను. దాని నతడు సరకుచేయక ప్రయాణము సాగించుచుండెను. శివుడు వృద్ధ బ్రాహ్మణ వేషమునవచ్చి ఇచ్చిన దివ్యాన్న మారగించి అతడు కల్పించిన సరస్సులో నీరు త్రాగి అప్పరు చెట్లనీడ విశ్రమించెను. తిరుప్పైజ్ఞీలివరకు బ్రాహ్మణుడు వెంట వచ్చి అదృశ్యుడయ్యెను. అతడే శివుడని గ్రహించి అప్ప రతని

గూర్చి పాడుకొనెను. పిదప తిరువన్నామలై, మైలాపూరు, తిరువొత్తియూరులు చూచుకొనుచు అప్పరు శ్రీకాళహస్తి చేరుకొని కన్నప్పరుకు వందనములాచరించెను. శివసంప్రదాయప్రకారము కాళహస్తి కైలాసమే. అప్ప రిప్పుడు హిమాలయములలోని ఉత్తర కైలాసముకూడ దర్శింపగోరెను. దూరభారముల ప్రయాణమగుటచే అనుచరులను కాశీలో విడిచి ఒక్కడే ముందుకు సాగెను. తిండి తగ్గించెను. కాళ్లు వాచుటచే చేతులపై నానుకొని పోవుచుండును. ప్రాకసాగెను. అవయవములు శిథిలమయ్యెను. ఎముకలు ముక్కలయ్యెను. ఇంకకదలలేకుండెను. అప్పరు అప్పుడే కైలాసమునకు రారాదు అని యెంచి సాధువేషమునవచ్చి శివుడు ప్రత్యక్షమయ్యెను. అప్పరు తిరిగి లేవగానే బలము కల్గెను. ఒకచెరువునుచూపి అందు మునిగితివేని తిరువైయూరు చేరుకొని అచట కైలాస దర్శనము పొందగలవని అప్పరుకు సాధువు చెప్పెను. అట్లే అప్పరు దానిలో మునిగి తిరువైయూరులో తేలెను. కైలాస మహోజ్వలదర్శనముపొంది తన్మయుడైపోయెను. ఆవేశముతో నాడెను, పాడెను. శివానుగ్రహమువల్ల నాకీదర్శనము లభించెనని గ్రహించెను.

తిరుప్పూంతురుత్తిలో నొకమఠమున అప్పరుండుటెరిగి సంబంధరు వచ్చుచుండగా అప్పరే రహస్యముగా ఎదురేగి పల్లకీబోయలలో నొకడుగా సంబంధరున్న పల్లకీ మోసెను. అప్పరుయొక్క నిరహంకారము నిస్స్వార్థత చూచి సంబంధరాశ్చర్యపడెను. పిదప అప్పరు మధురకుబోయి అచటి రాజును, రాణిని, మంత్రిని వారి శైవమతసేవకై

కొనియాడెను. రామేశ్వరముకూడ దర్శించుకొన్న పిదప తిరుప్పూగలూర్ చేరుకొనెను.

ఇచట భగవంతు డతని కొక పరీక్ష కల్పించెను. పరీక్షలో అత డోడలేదు. దేవాలయప్రాంగణములోని పనికి మాలిన మొక్కలను అప్పరు త్రవ్వి పారవేయుచుండగా నతని బొరిగ తగిలినచోటనెల్ల బంగారము మాణిక్యములు కనవచ్చుచుండెను. కంకరగాని కాంచనముగాని, మట్టిగాని మాణిక్యముగాని అతని కొక్కటే. గీత జీవన్ముక్తుని సమలోష్టాశ్మకాంచనుడని వర్ణించలేదా? ఇంతకన్నను పెద్ద పరీక్ష మరొకటి తటస్థించెను. స్వర్గమునుండి వచ్చి అతనిని వలపించుటకు అప్సరస లాటపాటలు సాగించిరి. భగవంతుని కంకితమైన అతని మనస్సు చలింపలేదు. తమ తప్పిదము క్షమింపుమని వా రతనికి ప్రణమిల్లి అంతర్ధానమైరి.

జీవయాత్ర సమాప్తము కావచ్చెను. అప్పరున కిప్పు డెనుబదేండ్లు దాటెను. అప్పరు తన్ను కైలాసమునకు తీసుకుపొమ్మని శివుని ప్రార్థించెను. చైత్రమాసమున నొక శుభదినమున నతని మహాయాత్ర సమాప్తమయ్యెను. శైవ సిద్ధాంతప్రకారము అప్పరు దాసమార్గమున కాదర్శ పురుషుడు. కాయముతోకూడ శివసేవచేయుటే అతనిపద్ధతి. అతడు ధరించిన బొరిగయే దానికి సాక్షి.

అప్పరు 4,900 కీర్తనలు రచించినట్లు చెప్పెదరు కాని 312 మాత్రము దొరకుచున్నవి. అతని కీర్తనలలో ప్రసాద గుణము, ఓజస్సు నున్నవి. తానుపడిన బాధలు, తాను నిరంతరసాధనవల్ల పొందిన విజయములుకూడ ఆ కీర్తనలలో

నున్నవి. ''శివుడే మహాదేవుడు. అతనినే శరణుపొందు''డని హృదయములు కంపించునట్లు అప్పరు పాడినాడు. పరిపూర్ణ ఆత్మార్పణ మవసరము అని బోధించినాడు. రావణునిపై కూడ శివు డెట్లు కృప జూపెనో తరుచు తన పాటలలో అప్పరు పాడియుండెను. నీ పూర్వచరిత్ర మెట్టిదైనను శివుని శరణుపొందినంతనే నీ కింక భయములేదు, నీ కింక విజయమే అని అప్పరు పాడియున్నాడు.

# సుందరమూర్తి

భగవంతుని తండ్రిగాగాని ప్రభువుగాగాని భావించుటంత కష్టముకాదు. కాని సఖునిగా భావించినచో నతని మాహేశ్వరత్వము మరువకుండుట కష్టము. భగవద్గీతలో శ్రీకృష్ణుని విరాడ్రూపముచూచిన అర్జునుడు తానిదివరకు సఖుడుగా కృష్ణునితో తీసుకొన్న చనువునకు పశ్చాత్తాపపడును. దీనాలాపములతో అర్జునుడు, "సఖుడవేయనుకొని, నీ మహత్త్వమెరుగక నిన్ను కృష్ణా, యాదవా, సఖా, అని చనువునను తెలివి తక్కువచేతను పిలుచువాడను. ఓ అచ్యుతా, అనంతా, నన్ను క్షమింపుము (గీత XI 41-42)" అని వేడుకొన్నాడు. పరిచయమువల్ల తిరస్కృతి కాకపోయినను ఉదాసీనతయైనను పెరుగును. సఖ్యమార్గమునన్నున్న చిక్కీయిది. అట్టి పొరపాటులు లేని జీవితము సుందరమూర్తిది. ఇతడు నలుగురాచార్యులలో నొకడు. క్రీ. శ. ఎనిమిదవ శతాబ్దమువాడు. తన గృహకలహములుకూడ చక్కదిద్దించుకొనునంతటి చనువు శివునితో ఇతనికి కలదనివిని, అట్టి పనులు శివునిచే చేయించినందుకు ఒక సమకాలీన యోగి కితనిపై ఆగ్రహము కల్గెను. కాని సఖ్యములో సుందరమూర్తి శివు నప్రమేయత్వ మెన్నడు మరువలేదు. శివు డతని సఖుడే గాక ప్రభువుకూడ.

ఏడవ తిరుముఱై లోని పాటలు సుందరమూర్తివి. అరు వదిముగ్గురు నాయన్మార్లు స్తుతించిన మొదటివా డితడే. ఆ అరువదిముగ్గురలోను తా నొక్కడు. ఈ పాటలను తిరుత్తొండత్తొగై యందురు. అందులో తాను ఆ మహాత్ముల దాసానుదాసుడనని చెప్పుకొన్నాడు. ఈ పాటల ఆధారము మీదనే శేక్కిలార్ తన పెరియపురాణములో వ్రాసెను. ఆ గ్రంథము సుందరమూర్తి జీవితముతో నారంభమై యత నితో సంబంధమున్న యితర మహాత్ముల జీవితములుకూడ వివరించుచు, తుదకు సుందరమూర్తి తెల్లని యేనుగుపై కూర్చుండి కైలాసమున కరుగువరకు వర్ణించును.

చోళరాజ్యమునకును తొండైమండలమునకును మధ్య గల ప్రదేశమునకు తిరుమునైప్పాడి యని పేరు. ఇచట తిరునావలూర్ అను పల్లెటూరిలో నొక ఆదిశైవ బ్రాహ్మణ కుటుంబమున సుందరరు జన్మించెను. సడైయనార్, ఇసై జ్ఞానియార్లితని తల్లిదండ్రులు. వారతనికి పెట్టినపేరు నంబి ఆరూరార్ కాని అతని అసమాన సౌందర్యమువల్లనో, లేక అతనికి కైలాసమునగల పేరునుబట్టో సుందరర్ అను పేరు వచ్చెను. శివుని కైలాసమందలి అనుచరుడు, హాలాహాల సుందరుడనువాడు పార్వతీదేవి సకియలలో కమలిని అనిందిత అను వారలను ప్రేమించెను. అందుచే వాడు ముగ్గురిని భూలోకమునపుట్టి అశాశ్వతప్రేమ చవిచూచిన పిదప కైలాసమునకు రమ్మని శివుడు శపించెను.

బాల్యమున నొకనాడు సుందరమూర్తి ఒక బొమ్మ బండితో ఆడుకొనుచుండగా ఆప్రాంతపు నాయక ప్రభు డతని

అందమునకు ముగ్ధుడై యతనిని పెంచుకొనగోరెను. తల్లిదండ్రు లంగీకరించిరి. రాజకుటుంబములో పెరిగినను బ్రాహ్మణోచిత శిక్షణే అతని కివ్వబడెను. అతనికి పెండ్లీడు రాగానే అతనితండ్రి పుత్తూరులోని శివాచార్యుని కుమార్తెను సుందరమూర్తికి నిశ్చయించెను. పెండ్లిసన్నాహములన్నియు పూర్తియయ్యెను. పెండ్లికొడుకు గుఱ్ఱముపై నెక్కి తనవారితో కలిసి పుత్తూరునకు వచ్చెను.

సుందరరును కాపాడుటకు భగవంతున కీ సమయమే చిక్కెనుకాబోలు! ఆపదకల్పించి పిదప రక్షించెడు భగవంతుని పద్ధతికిది యొక గొప్ప నిదర్శనము. పెండ్లి తంతులు కొంతవరకు నడచినవి. అంతలో శివుడొక వృద్ధబ్రాహ్మణ వేషమునవచ్చి సుందరర్ తాత తనకొక పత్రము వ్రాసి యిచ్చెననియు, దానిప్రకారము సుందరరు తనకు బానిస యనియు తనహక్కు తెలియబరచెను. సుందరరా బ్రాహ్మణుని దూషించుచు, "ఎక్కడనైనను ఒక బ్రాహ్మణుడు మరొక బ్రాహ్మణునకు బానిస యగునా? నీకు పిచ్చా?" అని, తనపై నతని కెట్టిహక్కు లేదని వాదించెను. అక్కడున్న వారందరు సుందరరుపక్షమే. అప్పుడు సుందరరు తాత వ్రాసియిచ్చిన పత్రము వృద్ధబ్రాహ్మణుడుతీసి చూపెను. అందులో తాను, తన వంశీయులూ బ్రాహ్మణునకు బానిసలుగా పనిచేయగలమని సుందరరు తాత వ్రాసియుండెను. అది దొంగపత్రమని సుందరరు లాగుకొని చింపివేసెను. ఐనను బ్రాహ్మణుడు కదలక తనహక్కు వినియోగించుకొనుటకు కూర్చుండెను. అతనిది నల్లూరు. నల్లూరు బ్రాహ్మణుల

సభలోనే యీ అభియోగము తేల్చుకొందమని అందరును అక్కడకుబోయిరి. అచట మరల వృద్ధబ్రాహ్మణుడు తనకు గల హక్కు తెలిపి, సుందరరు చింపివేసినది నకలు పత్రమనియు, అసలు పత్రము తనవద్ద నున్నదని తీసిచూపెను. సభవారది పరీక్షించి అది నిజమైన పత్రమే, దొంగపత్రము కాదని అంగీకరించిరి. సుందరరోడెను. కాని నల్లూరు బ్రాహ్మణు లెవ్వరును ఈ ముసలిబ్రాహ్మణు నెరుగ మనిరి. తనదా ఊరే అని ఋజువుచేయుట కతడు వారిని తనతో రమ్మని, తిరుఅరుత్తురై దేవాలయములోనికి ప్రవేశించి, అదృశ్యుడయ్యెను. తక్కినవారిని దూరముననిలిపి, సుందరరు డొక్కడు లోనికి వృద్ధబ్రాహ్మణుని వెదుకుటకు పోయెను. నందివాహనులై పార్వతీ పరమేశ్వరు లతనికి దర్శనమిచ్చిరి. ''నిన్ను కాపాడిన నాతో వాదమునకు దిగితివి కాబట్టి నీకు 'వన్‌తొండర్' (పెంకిభక్తుడు) అని పేరిడితిని. నన్ను పూజించు విధానములలో ఉత్తమమైనది నాకీర్తి గానము సేయుటే కాన నన్నుగూర్చిపాడు'' మని శివు డానతిచ్చెను. ''ఏమిపాడుదును ఎట్లారంభింతు'' నని సుందర రడిగెను. '' 'ఓ పిచ్చివాడా,' అని ఆరంభింపుము. ఆ బిరుదు నీవింతకు ముందే నాకిచ్చితి కదా!'' అని శివుడు పల్కెను. సుందరరులో కవితాగానములుబికి పొంగి పొరలెను. ''ఓ ఉన్మత్తా, ఓ చంద్రశేఖరా'', అని పాట నారంభించెను.

పెండ్లేమో భగ్నమయ్యెను. పెండ్లికూతురు మరొకనిని పెండ్లాడక కన్యగానే ఉండిపోయి, తుదకు మరణించెను. సిద్ధుడుగామారిన సుందరరు నావలూరులో శివపూజ చేసు

కొనుచు కొన్నాళ్లుండెను. తిరుత్తురై యూరులో కొన్నాళ్లుండి చిదంబరమునకు సుందరరు బయలుదేరెను.

దారిలో తిరునావుక్కరసు జైనమతమునువదలి శైవుడైన పుణ్యక్షేత్రము తిరువదిగై యున్నది. అట్టి పవిత్ర స్థలమును త్రొక్కుట కిష్టములేక సుందరరు ఊరుకు సమీపముననున్న ఒక మఠములో విశ్రమించెను. అచట పరుండి యుండగా నొక ముసలిబ్రాహ్మణుని పాదములు తన తలకు తగులజొచ్చెను. "ఏమయ్యా, తన్నుచుంటి"వని సుందరరడుగగా, ముసలితనమున తెలుసుకొనలేకపోతినని అతడు పల్కెను. సుందరమూర్తి కొంచెముదూరముపోయి పరుండెను. అచ్చటకూడ ఆ కాళ్లే తగలజొచ్చెను. "ఏమయ్యా" అని సుందరమూర్తి తిరిగి గద్దించి అడుగగా, నన్నెరుగవా, అని చెప్పుచు ఆబ్రాహ్మణుడు అంతర్ధానమయ్యెను. అతడే శివుడు, తన్ననుగ్రహించుటకు వచ్చినాడని సుందరమూర్తి గ్రహించెను. సుందరరు చిదంబరముచేరి, నటరాజకీర్తనసల్పెను. తిరువారూర్ వెళ్లుమని దైవవాణి అతనికి వినిపించెను. దారిలో అతడు సీర్కాళీ చేరుకొనుముందతనికి భగవద్దర్శనముకల్గెను. సీర్కాళీ సంబంధర్ జన్మస్థానమగుటచే సుందరమూర్తి దానిని త్రొక్కక ప్రక్కనుండి వెళ్లెను.

తిరువారూర్ ప్రజలతనికి ఘనస్వాగతమిచ్చిరి. ఇచటి దేవుని పేరే, (నంబిఆరూర్) తల్లిదండ్రులు సుందరరుకు పెట్టి ఉండిరి. ఈస్వామియే తన పూర్వులకు ఇలవేల్పు. ఈ ఊరనే సుందరరు జీవితమున నొక గొప్పవిషయము

జరిగెను. కైలాసమున తాను ప్రేమించిన వారిలో నొకతె యగు కమలిని ఇచట పరవైయార్ అను పేరిట జన్మించి యుండెను. ఆమె యిప్పుడు యుక్తవయస్కురాలు. వారిద్దరును దేవాలయములో కలుసుకొనిరి. ఒకరినొకరు ప్రేమించిరి. ఆమెను తనకు భార్యగా నొసఁగుమని సుందరమూర్తి శివుని ప్రార్థించెను. శివుడు తనభక్తులకగపడి వీరిద్దరికు పెండ్లి చేయుడని యుద్బోధించెను. పెండ్లియైనమీదట సుందర రాయూరనే కాపురము చేయసాగెను.

యథాప్రకార మొకనాడు సుందరమూర్తి దేవాలయమునకుబోయి, దేవాలయమంటపములో గుంపులుగుంపులుగా జేరిన భక్తులనుచూచి, వారికితగిన సేవకునిగా తన్నొనర్పుమని శివుని ప్రార్థించెను. భక్తులను కీర్తించుచు పాడుమని శివు డాజ్ఞాపించెను. ఎట్లారంభింపవలెనో తెలియకున్న సుందరరుకు శివుడు, "చిదంబరమందు వసించు బ్రాహ్మణులకు దాసానుదాసుడ"నని ఆరంభింపుమనెను. అరువది ముగ్గురు నాయన్మారులగూర్చి సుందరరుపాడెను. ఈపాటే శేక్కిలారు పెరియపురాణమున కాధారమయ్యెను.

కుండైయూరులోనున్న ఒక రైతునకు సుందరమూర్తి యందమితభక్తి. ధాన్యము మొదలైనవి సుందరరునకు సరఫరా చేయువాడు. కాటకకారణమున పంపుటకు బియ్యము చాలక, విచారముతో పస్తుండి దిగులుపడుచుండెను. శివుడు కలలో కనుపించి తగినంత ధాన్యము దొరుకునట్లు చేసితినని చెప్పెను. మరునాడుదయమున చూచిన, ఊరిలో నంతటను పెద్దధాన్యరాశులుండెను. కాని తిరువారూరులోనున్న సుందర

రింటికి ఏనిని తరలించుటెట్లు? సుందరరున కీ సంగతి యెరిగించుటకు రైతు బయలుదేరెను. కాని ఇంతకుముందే శివుడు సుందరరుకు తెలియజేయుటచే సుందరరు కుండైయూరుకు బయలుదేరియుండెను; దారిలో రైతును కలుసుకొనెను. ఇద్దరును కుండైయూరుకు బోయిరి. కృతజ్ఞతదెల్పుచు, సుందరరు శివునే ధాన్యము తిరువారూరు తరలింపుమని ప్రార్థించెను. రాత్రికిరాత్రి శివగణము ధాన్యము తిరువారూరు మోసివేసెను. పరవైయారు ఇల్లేగాక ఊరిలోని ఇండ్లన్నియు ధాన్యముతో నిండిపోయెను.

తిరునాట్టియత్తాంకుడిలో కొట్పులియారను శివయోగి యుండెను. అతని ఆహ్వానముపై సుందరరు వారింటికి వెళ్లినప్పు డతడు సింగడీ, వనప్పగై లను తన ఇద్దరు కుమార్తెలను వివాహమాడమని సుందరరును కోరెను. వారిని తన కుమార్తెలవలె చూచుచున్నానని అందుచే వివాహమాడలేనని వినయముతో సుందరరు పల్కెను. తనకీర్తనలు కొన్నింటిలో తాను వారిద్దరి తండ్రినని సుందరరు పాడియున్నాడు.

తిరువారూరులో ప్రతియేటా జరుగు ఉత్సవము సమీపించుచుండెను. దానిలో పాల్గొనుటకు వచ్చు భక్తుల నాదరించుటకు పరవైయారువద్ద ధనములేదు. సుందరరు తిరుప్పుగలూరు దేవాలయమునకు బోయి ధనము కోరుచు పాట పాడెను. పాడి, అలసిపోయి, దగ్గరనున్న మఠములో తలగడగా కొన్ని ఇటుకలు పెట్టుకొని నిద్రపోయెను. లేచు

సరి కవి బంగారు ఇటుకలుగా మారియుండెను. వానిని భక్తులకొఱకు వెచ్చించిరి.

తిరువాలంపొలిల్ వద్ద సుందరరు నిద్రపోవుచుండగా శివుడగుపించి, "మలపాడి మరచితివా?" అనుటచే సుందరరా ఊరు వెళ్లి, కొన్నాళ్లచట శివకీర్తన చేయుచుండెను. తిరుప్పాచ్చిరమువద్ద శివు నడిగి బంగారము పడసెను. తిరుప్పైఞ్జీలివద్ద మహేశ్వరుని భిక్షాటనరూపమున దర్శించెను. నమశ్శివాయమంత్రముగూర్చి కీర్తనలు రచించెను. తిరుప్పేరూర్ వద్ద శివుని తాండవరూపదర్శనము పొందెను. చిదంబరమునకు పోవుచూ దారిలోనున్న తిరుక్కూడలైయారును దర్శించకుండ, ముందుకుసాగిపోదలచెను. కాని శివుడే బ్రాహ్మణవేషమునవచ్చి ఆ పవిత్రస్థానముకూడ దర్శించుమని చెప్పిపంపెను. ఆ క్షేత్రము దర్శించి పిదప సుందరరు తిరుముదుకున్రు చేరెను.

ధనమునకై మరల సుందరరు ప్రార్థింపగా పండ్రెండు వేల బంగారునాణెము లతనికి లభించెను. వానిని తిరువారూరు పంపుమని భగవంతుని ప్రార్థింపగా మణిముత్తారు అను అచటి చెరువులో వానిని క్షమ్మరించి తిరువారూరు చెరువులో తీసుకొమ్మని శివుడు సుందరరునకు తెల్పెను. సుందరరొక్కనాణెమునుమాత్రము సరిచూచుకొనుట కుంచుకొని తక్కినవి ఆ చెరువులో క్రుమ్మరించెను. చిదంబరము చూచుకొని, సుందరారు తిరువారూరుకుపోయి భార్యకు నాణెముల సంగతి చెప్పగా, నామె చెరువులో ధనము దొరుకునన్న మాట నమ్మలేకపోయెను. ఆమెను వెంటతీసుకొని సుందరరు

చెరువువద్దకుపోయి బంగారునాణెములు కానక ఒక్క కీర్తన పాడెను. బంగారు కానవచ్చెను. కాని వన్నె కొంచెము తక్కువగా నుండుటచే మరొక్క కీర్తన పాడెను. నాణెములు నిండువన్నెగల బంగారునాణెములయ్యెను.

కొన్నాళ్లు విశ్రాంతి తీసుకొనిన పిమ్మట సుందరరు తిరిగి శివాలయముల దర్శనార్థము బయలుదేరి, చాల ప్రదేశములందు పాడుకొనుచుండెను. సంబంధరుకు బంగారు తాళములు లభించిన తిరుక్కోలక్కావద్దకూడ పాటలు పాడెను. తిరుక్కురుగావూర్ పోవు దారిలో సుందరరునకు అతని అనుచరులకు ఆకలిదప్పులు మిక్కుటముగా కలిగెను. శివుడు బ్రాహ్మణవేషమున తినుబండారములు తెచ్చిపెట్టెను; తిన్నకొలది పదార్థములు పెరుగుచుండెను. భుక్తాయాసముతో వారందరు పరుండి లేచుసరికా బ్రాహ్మణుడు లేడు. అతడే శివుడని గ్రహించి సుందరరతనిగూర్చి ఒకపాట పాడెను.

తిరుకచ్చూరులోకూడ సుందరరున కాకలివేసినపుడు, శివుడు బ్రాహ్మణవేషమునవచ్చి భిక్షాటనచేసి అన్నము తెచ్చెదనని చెప్పి ఇంటింటికివెళ్లి కావలసినంత భోజనము తెచ్చిపెట్టి, అదృశ్యుడయ్యెను. కంచి కాళహస్తులు సేవించి సుందరరు తిరువొర్రియూరు చేరెను. రెండవ కైలాసకాంత అనిందిత, యీ ఊరనే సంగలియారను పేర నొక కర్షకునింట పుట్టి, ఎన్ని పెండ్లి సంబంధములు వచ్చిన నొల్లక, ఒక మహాశివయోగి సేవచేయుటే తన యాశయమని, అచటి శివాలయమున సేవచేయుచుండెను. శివలింగమునకు ప్రతి

దినము పూలమాలలు గ్రుచ్చుచుండెడిది. సుందరర లోకనా డామెను ఆలయమునచూచి వెంటనే ప్రేమవశుడయ్యెను. తనకోర్కెలు తీర్చుమని భగవంతునడుగుట సుందరరుని పరిపాటియేకదా! ఆమెతో తనకు పెండ్లి కుదుర్చుమని యతడు శివుని కోరెను. ఆమెకు శివుడు కలలో కనబడి సుందరరును పెండ్లాడమని చెప్పెను. తన్నువిడిచి తిరిగి సుందరరు పరవైయూరువద్దకు పోవునేమో అను భయ మామెకు కలదు. అందుచే విడిచిపోనని సుందరరుచే బాస చేయింతునని శివు డభయమిచ్చెను. కాని బాసచేయు సమయమున శివుడు దేవాలయమువిడిచి బయటచెట్టుక్రింద ఉండవలెనని సుందరరు కోరెను. బాస నెగగొట్టు తలంపు సుందరరునకు గలదని శివుడు గ్రహించి, చెట్టుక్రింద బాస చేయునట్లు సుందరరుని కోరమని శివుడు సంగిలియారు కెరిగించెను. అట్లే సుందరరు ప్రమాణముచేసి ఆమెను పెండ్లాడెను. ఆమెతో కొన్నాళ్లు సుఖముగా కాలము గడిపెను.

వసంతము వచ్చెను. దానితో తిరువారూరు ఉత్సవము సుందరరునకు జ్ఞాపకమునకు వచ్చెను; పరవైయారు ఆట పాటలు జ్ఞాపకమునకు వచ్చెను. ఉండలేక, బాసమీరి, సుందరరు బయలుదేరెను. అందుచే దారిలో పూర్తిగా గ్రుడ్డివాడైపోయెను. దారినడుగుచు, పోవుచుండెను. తిరువెన్పాక్కంవద్ద అతనికి శివుడే ఒక చేతికర్ర నిచ్చెను. కాంచీపురమువద్ద ఎడమకంటికి దృష్టి నిచ్చెను. తిరుత్తురుత్తి వద్ద అతని కారోగ్యము లభించెను. చివరకు తిరువారూరు

చేరుకొని దేవాలయములో దేవుని తనకు రెండవకంటి దృష్టి కూడ ఇమ్మని ప్రార్థించి పడసెను. పరవైయారుకు కబురంపెను, కాని ఆమె కోపముతో రాకుండెను. ఆమె ననునయింపుమని సుందరరు శివునే వేడుకొనెను. పురోహితునివలె శివుడామెయింటికివెళ్లి ఆమె నొప్పింపబోగా, ఆమె ఒప్పుకొనదయ్యెను. చివరకు శివుడు తన నిజరూపమును చూపగా, ఆమె కాళ్లపైబడి క్షమాపణ గోరెను. ఆమె ఆగ్రహాము శమించెను. భర్తను చేర నంగీకరించెను. సుందరరు పరవైయారులు వెనుకటివలెనే సుఖముగా కాపురము చేయుచుండిరి.

సుందరరు శివుని తన ప్రణయకలహాములందు మధ్యవర్తిగా నడిపినందుకు ఏయర్కోన్ కలిక్కామర్ అను మహాత్మునకు సుందరరుపై ఆగ్రహాము కల్గెను. కలిక్కామరు దురభిప్రాయము తొలగించుటకు శివుడతనికి కడుపునొప్పి కలుగజేసి, దానిని సుందరరే కుదుర్చగలడని తెల్పెను. శివుడు సుందరరునితోకూడ కలిక్కామరు నొప్పితగ్గించమని చెప్పెను. సుందరరు చికిత్సకొడబడక రోషముతో కలిక్కామరు కత్తితో తనప్రేగులు కోసుకొని ఆత్మహత్య చేసుకొనెను. సుందరరుకిది తెలియక గదిలోనికి వెళ్లి కలిక్కామరు శవమును చూచి దుఃఖముతో తానును ఆకత్తితోనే పొడుచుకొని మరణింపదలచెను. కాని శివానుగ్రహామువల్ల కలిక్కామరు మరల సజీవుడయ్యెను. సుందరరుని శుద్ధభక్తి యిపుడు కలిక్కామరు కర్థమయ్యెను.

చేర ప్రాంతాధిపతియగు చేరమాన్ పెరుమాళ్ సుందరరుతో ఆంతరంగికస్నేహముగల మహాత్ముడు. సుందరరు దర్శనమున కతడు తిరువారూరు వచ్చెను. వారిద్దరును కలిసి ప్రముఖశివాలయములు దర్శించిరి. మధురలో చోళ పాండ్యరాజులు వారలను గౌరవించిరి. వారు రామేశ్వరమువరకు యాత్ర చేసి తిరిగి తిరువారూరు చేరుకొనిరి. చేరమాను ప్రార్థనపై సుందరరతని రాజధానికి బయలు దేరెను. దారిలో కావేరీ వరదలు హెచ్చుగా నుండుటచే, పడవలు నడుచుటలేదు. కావేరి కావలివైపున నున్న తిరువైయూరు చేరమాన్ దర్శింపగోరుటచే, సుందరరొక కీర్తన పాడగా వీరందరు దాటుటకు వరద దారి నిచ్చెను. వారు సపరివారముగా క్షేమముగా నావలియొడ్డు జేరగల్గిరి.

వారిద్దరును సుందరమైన ప్రదేశములగుండా పశ్చిమ తీరము చేరుకొనిరి. వారికి చేరరాజధానియగు కొడుంకోళూరు వద్ద ఘనస్వాగతము లభించెను. ముందుగా తిరువన్ చిక్కులం దేవాలయములో పూజించి, పిదప సుందరరు యేనుగు అంబారీపై నూరేగుచు రాజప్రాసాదమునకు బోయెను. రాజే అతనికి చామరములు వీచుచు వెనుక నిలబడెను. అచటి ఆతిథ్యము కొద్దిరోజు లందుకొని సుందరరు తిరిగి ఇంటికి బయలుదేరెను. విడువలేక విడువలేక చేరమాన్ బహుమానములతో సుందరరును సాగనంపెను. ఆటవికుల రూపమున శివుడు పంపిన దూతలువచ్చి దారిలో తిరుమురుగన్ పూండివద్ద ఆ బహుమానములు కొల్లగొట్టిరి.

సుందరరు దేవాలయములోనికిపోయి శివునితో ఫిర్యాదు చేసెను. దొంగిలింపబడిన ఆస్తి భద్రముగా అతనికి మరల దక్కెను.

తిరువారూరులో కొద్దినాళ్లే ఉండి, సుందరరు తిరిగి చేర రాజధానికి బయలుదేరెను. దారిలో ఒకయూర ఒక యింట యేడ్పులు, యెదురింట ఆనందోత్సవములు చూచి యతడు కారణ మడిగెను. ఏడ్చువారింటి బిడ్డను సరస్సులో మొసలి మ్రింగెననియు, ఎదురింటి బిడ్డ తప్పించుకు రాగలైననియు అతని కిప్పుడు వడుగు జరుగుచున్నదనియు చెప్పిరి. సుందరరు పోయిన బాలుని తల్లిదండ్రులను తీసుకొని సరస్సునకు పోయి పిల్లవాని నిమ్మని భగవంతునిగూర్చి ఒక కీర్తన పాడెను. మొసలే ఆ పిల్లవానిని వెనుకకు తెచ్చియిచ్చెను. ఈ వార్త చేర రాజధానివరకు వ్యాపించుటచే నచట సుందరరుకు ఘనస్వాగత మెదురయ్యెను. చేరమాన్ ఆనందమునకు హద్దులేదు. ఈసారి సుందరరు కతడు ధవళచ్ఛత్రము పట్టి ఇంటికి తీసుకువెళ్లెను. చేరమాన్ స్నానముచేయుచున్న సమయమున సుందరరు దేవాలయమునకుపోయి తన్ను కైలాసమునకు గొంపొమ్మని శివుని ప్రార్థించెను. శివుడు తన దేవగణమును పంపెను. తెల్లని యేనుగుకూడ వచ్చెను. దానిపై కూర్చుండి సుందరరు ఆకాశవీథిని పోవుచుండగా చేరమాన్ వచ్చి చూచి దగ్గరనున్న గుఱ్ఱమునెక్కి దాని చెవిలో శివమంత్ర ముచ్చరింపగా నదియు వినువీథికెగసి, ఏనుగునకు ప్రదక్షిణముసేసి, ముందు నడచెను. చేరసైనికు లాత్మహత్యద్వారా సూక్ష్మశరీరములతో తమ ప్రభువును

వెంబడించిరి. సుందరరు చేరమాను లిద్దరును కైలాసద్వారము చేరుకొనిరి. అచట సుందరరుని లోనికి రానిచ్చి చేరమానును బయటనే ప్రమథగణముంచెను. సుందరరు చేరమానుని కూడ తనసన్నిధికి పిలుచుకొమ్మని శివుని వేడుకొనెను. శివుడు చేరమానుని లోనికి తెచ్చుటకు నందిని పంపెను. చేరమాను సుందరరు లిద్దరును శివపాదముల జేరి శివకీర్తన గానము సేసిరి. పార్వతీదేవికృపచే సుందరరుని భార్యలిద్దరును కైలాసమునకు పిలువబడిరి. యథాప్రకారము వారు కమలిని, అనిందితలైరి.

సుందరమూర్తిది సఖ్యమార్గము. సఖునితోనుండు చనువు నిందు చూడగలము. ఇచట సఖుడు శివుడు కాబట్టి శివుని గొప్పతన మెప్పుడు మరుపునకు రాలేదు. సఖుని చనువుతోబాటు సుందరరుని కీర్తనలలో గాఢభక్తియు కాన్పించును. సుందరరు 38,000 కీర్తనలు పాడెనట. కాని నూరు మాత్రమే యిప్పుడు దొరుకుచున్నవి. తనజీవితము లోని సంగతులెన్నో యీ పాటలలో సుందరరు తెల్పెను. సంబంధరు తిరునావుక్కరసులగూర్చికూడ పాడియున్నాడు. ఇహమున తానేమి యనుభవింపదలచినను శివునడుగుటకు సుందరరు సంకోచింపడు. మోక్షమువలెనే, భోగముకూడ, భగవత్కృపవల్లనే కల్గునని యతని గాఢవిశ్వాసము.

శివుని ఉజ్వలమాహేశ్వరత్వమునుగూర్చి సుందరరు శోభాయమానముగా వర్ణించినాడు. అన్నిప్రాణులలోను, లోన బయట, శివుడే సర్వత్రా వ్యాపించియున్నాడు,

అతీతుడై కూడ ఉన్నాడనియు, కార్య, క్రియ, యోగ, జ్ఞానములను నాల్గు మార్గములగూర్చియు సుందరరు కీర్తనలు తెలుపును. తన ఒక్కని మోక్షమేగాక అందరి ముక్తి నతడు కోరెను. ప్రభుని తనమిత్రునిగా భావించినను సుందరరు తన లోపముల నెన్నడు విస్మరింపలేదు. తనలోపములతోనే తన్ను తనప్రభున కర్పించుకొనెను. వానితోనే అతడు స్వీకరింపబడెను.

# మాణిక్యవాచకర్

మధురభావసాధనలో అమూల్య అవకాశము లున్నవి; ఆపదలును ఉన్నవి. ఈ నాయికాప్రేమసాధనలో సాధకుడు తన్ను భగవంతుని ప్రియురాలిగా భావించుకొనును. సాధన చేయువారు స్త్రీలు కావచ్చు, పురుషులు కావచ్చు, ఎవరైనను తమ్ము నాయికలగానే భావించుకొందురు. పరమాత్మ యొక్కడే పురుషుడు. జీవాత్మలన్నియు అతని ప్రియురాండ్రే. మధురభావతత్వ మిదియే. బృందావనగాథయొక్క అంతరార్థ మిదియే. నారదుడు తన భక్తిసూత్రములలో గోపికలనే భక్తి కుత్కృష్ట ఉదాహరణగా పేర్కొనినాడు. హిందూశాస్త్రములలో జీవాత్మపరమాత్మల సంధానసుఖము స్త్రీపురుషుల సంయోగసుఖముతో పోల్చబడినది. కొన్ని మతశాఖలవారు దీని నక్షరాలా పాటించి దురభ్యాసములకు లోనైరి. స్వచ్ఛమైన మధురభావముమాత్ర మత్యున్నతమైనది. అనన్యభక్తిని, భగవంతునిలో లీనముకావలెనను తీవ్రవాంఛను, ఈ నాయికాప్రేమ సూచించును. మాణిక్యవాచకర్ యొక్క కీర్తనలలోను అతనిజీవితములోను ఈ మధురభావము స్పష్టముగా గోచరించును. ప్రియునిగానే కాక భగవంతుని గురువుగాకూడ భావించుటచే నాయికాప్రేమలో నింకే అపాయము కలుగదు. మాణిక్యవాచకర్ నకు శివుడు మొదట గురువుగా కన్పించెను. అట్లుద్ధరింపబడినమీాదట మాణిక్యవాచకరునకు శివసేవ, శివసంధానముతక్క మరి కోరవలసినది లేకపోయెను.

మాణిక్యవాచకర్ తిరువాచకము, తిరుక్కోవైయారుల రచించెను. తిరువాచకమునకు కరగని హృదయము దేనికిని కరగదని తమిళమున నొకసామెత ఉన్నది. అందలిభావములు భాష మనస్సును ద్రవింపజేయును. 19-వ శతాబ్దములోని రామలింగయోగి మాణిక్యవాచకరునుగూర్చి, "ఓ దివ్య మాణిక్యవాచకా, నీ పాట లర్థమెరిగి పాడినప్పుడు నాదేహము నా ఆత్మయు చెరుకుపానకములో తేనె పాలు కలిపి మధుర ఫలములు నానవేసినట్లగును. నీ కీర్తనామృత మెంత గ్రోలినను తనివితీరదు" అని వ్రాసినాడు. మాణిక్యవాచకరు క్రీ. శ. మూడవ ఆరవ శతాబ్దముల మధ్యవాడు.

శేక్కిలార్ వ్రాసిన పెరియపురాణములో మాణిక్య వాచకరు జీవితము లేదు; కాని తిరువాదవూరా్ అడిగళ్ పురాణములోమాత్రమున్నది. తిరువిళైయాడల్ పురాణ ములలోను మరికొన్ని గ్రంథములలోను ఇంకను కొన్ని జీవిత విశేషములు దొరుకుచున్నవి. మధురకు సమీపమున తిరువాదవూర్ లో నొక ఆదిశైవబ్రాహ్మణకుటుంబమున మాణిక్యవాచకరు జన్మించెను. వారిది అమాత్యవంశము. తండ్రి శంభుపాదాశ్రితర్, తల్లి శివజ్ఞానవతి. తల్లిదండ్రులు పెట్టినపేరు తెలియదు. ఊరునుబట్టి అతనిని తిరువాదవూరర్ అని పిలుచుచుండిరి. పదియారేడుల కతడు సమస్త శాస్త్రములు, కళలు నేర్చెను. పాండ్యరాజతని ప్రజ్ఞగూర్చి విని, "తెన్నవన్ బ్రహ్మరాయన్" అను బిరుదునిచ్చి తన ముఖ్యమంత్రిగా జేసికొనెను. మాణిక్యవాచకరు మంచి పరిపాలనాదక్షతను చూపెను. కాని ఉద్యోగము విడిచి,

పరమార్థసాధనలో కాలము గడుప కాంక్షించుచుండెను. శివభక్తి హెచ్చెను. గురువుకొరకతడు చూచుచుండెను.

ఒకనాడు రాజదర్బారు జరుగుచుండగా తూర్పు సముద్రతీరమున అమ్మకమునకు మంచిగుఱ్ఱములు దిగినవని వార్త వచ్చెను. ధనముతీసుకొనివెళ్లి గుఱ్ఱములను కొనమని రాజు ముఖ్యమంత్రినే పంపెను. చొక్కనాథాలయమున శివపూజ చేసుకొని, తనకు గురువును ప్రసాదింపుమని ప్రార్థించి, మాణిక్యవాచకరు బయలుదేరెను. తిరుప్పెరుంతురై ఓడరేవు సమీపించుసరి కతనికి వేదనాదములు వినబడెను. ఆ ధ్వనివైపువెళ్లి చెట్లగుంపులో శిష్యులమధ్య కూర్చుండిన గురువును చూచెను. మాణిక్యవాచకరును రక్షించుటకు గురువేషమున వచ్చిన శివుడే యతడు. తత్‌క్షణము మాణిక్య వాచకరు తనగురువును గుర్తించి, వచ్చినపని మరచి, గురు పాదముల కాత్మార్పణముచేసికొనెను. అతనిలో కవితా ధార పుట్టుకొనివచ్చెను. శివుని కీర్తించుచు మధురగీతము లతని నోటినుండి వెలువడెను. శివుడు సంప్రీతుడై యతనికి మాణిక్యవాచకరను బిరుదు నిచ్చెను. అనగా మాణిక్య ములవంటి మాటలు కలవాడని అర్థము. అతడు తెచ్చిన ధనము శివభక్తులకు నచటి శివాలయము బాగుచేయించు టకు వెచ్చించి సన్న్యాసియై శివభక్తులలో నేకమయ్యెను.

ఆతనితో వచ్చిన ఉద్యోగులు కొన్నాళ్లు వేచియుండిరి కాని మధురకు తిరిగివచ్చు నుద్దేశ మతనిలో గానక వారు వెళ్లి రాజు కీ వృత్తాంతము తెలిపిరి. రాజు మండిపడి మాణిక్యవాచకరునకు గుఱ్ఱములుకాని ధనముకాని తెచ్చి

యిమ్మని కబురంపెను. మాణిక్యవాచకరు కిప్పుడు భగవంతు డొక్కడే ప్రభువు. ఏమిచేయుదునని గురువు నడుగగా ఆవణి మూలమునాటికి గుఱ్ఱములు వచ్చునని రాజుకు కబురంపుమని గురు వతనికి చెప్పెను. రాజునకు బహుమతిగా ఇచ్చుట కొక అమూల్యరత్నముకూడ గురువిచ్చెను. మాణిక్యవాచకరు గురువు చెప్పినట్లే చేసెను. రాజు సంతోషించెను. కాని ఆవణిమూలము దగ్గర పడుచున్నను రేవులో గుఱ్ఱములజాడే లేదని వేగులు చెప్పుటతో రాజు కోపగించి మాణిక్యవాచకరును ఖైదులో నుంచెను. శివునిమాట ప్రకారము గుఱ్ఱములు వచ్చినవి; విదేశీయులు గుఱ్ఱముల నడిపించుకొని వచ్చిరి. వారికి శివుడే యజమాని. మాణిక్యవాచకరును ఖైదునుండి విడుదలచేసిరి. మాట నిలుపుకొన్న శివుని చూచుట కతడు రాజసభకు వచ్చెను. తన్ను రక్షించిన ప్రభు వతడే యని మాణిక్యవాచకరు గుఱ్ఱపు యజమానిని చూపగా, రాజప్రయత్నముగా లేచి, చేతులు జోడించి యతనికి నమస్కరించెను కాని తిరిగి మాయ క్రమ్ముటచే గుఱ్ఱపు యజమానిని సామాన్యునిగా నెంచి గుఱ్ఱములగూర్చి ప్రశ్నలువేసి, తన అశ్వశాస్త్రవేత్తలచే నా గుఱ్ఱముల లక్షణములు చూపించి, మంచివని తెల్సుకొనెను. గుఱ్ఱపు నాయకునకు రాజొక పట్టురుమాలు బహూకరింపగా నతడు దానిని తన కొరడా కర్రతో తీసుకొనుటచూచి రా జాగ్రహించెను. అది అతని దేశాచారమని మాణిక్యవాచకరు నచ్చచెప్పి రాజును శాంతపరచెను.

ఆ నడిరాత్రి ఒకచిత్రము జరిగెను. విశేషధనమిచ్చి కొన్న గుఱ్ఱములు నక్కలుగా మారి, గుఱ్ఱపుశాలలనుండి

పారిపోయి వీథులలో నానాఅల్లరి చేసి తుదకు మాయ మయ్యెను. అది విని రాజు మండిపడెను. మోసముచేసిన మాణిక్యవాచకరును ధనమిచ్చువరకు హింసింపుడని రాజాజ్ఞ వేసెను. అతనిని మండుటెండలో వైగైనది ఇసుక మీద నిలబెట్టిరి. రాజుకు బుద్ధిగరపుటకు శివుడు నదీజలముల నూరిలోనికి పొంగించెను. రక్షింపుమని రాజు మాణిక్య వాచకరును వేడుకొనగా వరద తగ్గెను. నదిగట్టు బాగు చేయింపుమని మాణిక్యవాచకరు రాజునకు చెప్పెను. ఊరి వారందరు తత్క్షణము పనికి రావలెనని ఆజ్ఞ యయ్యెను. ప్రతివానికి కొంత పని నిర్ణయింపబడెను.

తినుబండారములుచేసి అమ్ముకొని జీవించు వంతి అను నొక వృద్ధస్త్రీ తనకు నిర్ణయింపబడ్డ పని చేయలేక తన తినుబండారముల కెవరైనను తనకు బదులు పని చేయుదు రేమో అని చూచుచుండెను. అవి అంత మంచివి కాక పోవుటచే నెవ్వరును ఒప్పుకొనలేదు. ఆమె గొప్ప శివభక్తు రాలు. శివునే సాయము వేడెను. శివుడే ఒక యువకుని వేషమున వచ్చి ఆమె బదులు పనిచేయుట కొప్పుకొనెను. పని తనిఖీచేయుచువచ్చి రాజా యువకుడు సరిగా పనిచేయుట లేదని తన చేతికర్రతో అతని వీపుమీద కొట్టెను. దానితో యువకుని భుజములమీదనున్న ఒక తట్టెడు మట్టి గండిలో పడినంతమాత్రమున గట్టు పూర్తియైపోయెను! కాని ఆ కర్ర దెబ్బ అందరి వీపులమీదను, చివరకు రాజుగారివీపుమీద కూడ పడెను. వంతి స్వర్గమున కెగసెను. యువకుడు మాయమయ్యెను. మాణిక్యవాచకరునెడ రా జింతవరకు

చేసిన అగౌరవమునకు ఆకాశవాణి రాజును మందలించెను. తన తప్పు గ్రహించి, రాజు ధ్యానములోనున్న మాణిక్య వాచకరుకడకేగి తిరిగి మహామంత్రిపదవి వహింపుమని కోరెను. ప్రపంచవిషయములు పరిత్యజించినవాడు కాన అతడు తిరిగి గ్రహింపలేదు. శివునాజ్ఞప్రకారము మాణిక్య వాచకరు చిదంబరమునకు కాలినడకను బయలుదేరెను.

ప్రథమమున తనకు గురువు కనిపించిన ప్రదేశమునకు వచ్చి తిరిగి అదేప్రకార మచట కూర్చుండి ఉన్న గురువును దర్శించెను. గురువు కైలాసమునకు పోగోరెను. తక్కిన శిష్యులును వత్తు మనిరి. ఒక ప్రత్యేకదినమున చెరువులో మంటలు లేచుననియు, దానిలో దుమికినవారు తన్ను కైలాస మున కలుసుకొందురనియు గురువు సెలవిచ్చెను. మాణిక్య వాచకరుమాత్ర మప్పుడే కైలాసమునకు రారాదు. శివకీర్తనలు పాడుకొనుచు, శైవసిద్ధాంతములు బోధించుచు నతడు చిదంబరమేగవలెనని గురు వానతిచ్చెను. తిరుఉత్తరకోస మంగై వద్దను, తిరిగి తిరువన్నామలై వద్దను మాణిక్యవాచకరు నకు శివుడు గురురూపమున దర్శనమిచ్చెను. అది పవిత్ర మార్గశిరమాసమగుటచే తెల్లవారగనే కన్యలు గుంపులు గుంపులుగాపోయి సరస్సులో స్నానముచేసి ఆలయమున భగవత్కీర్తనలు గానముచేయుచుండిరి. వారికొరకు మాణిక్యవాచకరు తిరువెంబావై కీర్తనలు రచించెను. తిరుక్కళుక్కున్రమ్‌వద్ద తిరిగి మహాగురుదర్శన మతనికి కల్గెను.

చివరకు మాణిక్యవాచకరు చిదంబరము జేరుకొని

నటరాజుముందు మైమరచి పడిపోయెను. స్మృతికల్గినమీాదట అనేక కీర్తనలతో శివస్తోత్రము గావించెను. అతనికి శివుని త్రివిధాకారభావ మవగాహనమయ్యెను. అవి : (1) నటరాజాకారము. (2) సాకార నిరాకార మూలస్థానలింగము. (3) నిరాకార ఆకాశలింగము. దీనినే చిదంబర రహస్య మందురు. చిదంబరములో తనకు ముక్తి కల్గునని శివుడు చెప్పిఉండుటచే మాణిక్యవాచకరు అచ్చటనే ఊరుబయట నివాసమేర్పరచుకొనెను. శివయోగ మభ్యసించుచు ప్రతి దినము ఆలయమున నటరాజసుందరవిగ్రహదర్శనము చేసుకొనుచుండెను. తిరువాచకములోని చాల కీర్తన లిచట రచించినవే.

ఒకనాడు సింహళరాజు తన మూగకూతురితోను, బౌద్ధగురువులతోను చిదంబరమున కేతెంచెను. అత డొక శివయోగిద్వారా చిదంబరస్థలమాహాత్మ్యము వినియుండెను. బౌద్ధుడైనను ఆ రాజునకు తన కూతురి మూగతన మిచట పోవునని యొక ఆశయుండెను. బౌద్ధగురువులు వాదములో శైవసిద్ధాంతవేత్తల నోడింపగోరి వచ్చిరి. శివుడు చిదంబరములోని దీక్షితారుల కగుపించి బౌద్ధగురువులతో వాదించుటకు మాణిక్యవాచకరు నొప్పించి పంపుడని తెలిపెను. ఆలయమున వాదము జరిగెను. ప్రత్యేకము అది వినుటకు చోళరాజు వచ్చియుండెను. జనసమూహము క్రిక్కిరిసిపోయెను. తన అనుచరులతో సింహళరాజుకూడ వచ్చెను. బౌద్ధగురువులు తమ సిద్ధాంతముల వివరించిరి; శివుని ఘనతను మాణిక్యవాచకరు వివరించెను. బౌద్ధులు శివుని దూషింప

సాగిరి. బౌద్ధులను విద్యాదేవి త్యజించుగాక అని మాణిక్య వాచకరును ప్రార్థించెను. చిత్రముగా బౌద్ధులు మూగవారై పోయిరి. తనకూతురికి మాట ప్రసాదింపుమని సింహళరాజు మాణిక్యవాచకరును ప్రార్థించెను. మాణిక్యవాచక రా పిల్లకు మాట్లాడు శక్తి నిచ్చి ఆమెచేతనే బౌద్ధుల వాదములు ఖండింపజేసెను. తిరువాచక కీర్తనలోని తిరుచ్చాళల్ లో సింహళరాజు కుమార్తె చెప్పిన సంగతులున్నవి. సింహళ రాజు తనప్రజలతోసహా శైవమత మవలంబించెను. రాజు ప్రార్థనపై మాణిక్యవాచకరు బౌద్ధగురువుల మూగతనము తొలగించెను. వారును శైవులైరి. పిదప మాణిక్యవాచకరు తన ఆశ్రమమునకు వెళ్లిపోయెను.

బ్రాహ్మణవేషమున శివుడు మాణిక్యవాచకరు ఆశ్రమమునకువచ్చి అతని కీర్తనలు వ్రాసుకొనగోరెను. తిరువాచకము మాణిక్యవాచకరు పాడగా శివుడు వ్రాసుకొనెను. చిదంబర నాథునిగూర్చి పాడుమని శివుడు కోరగా నతడు తిరుక్కోవై యార్ పాడెను. శివుడు వ్రాసుకొని చివర "వాదవూరన్ పాడగా అంబలవన్ (చిదంబరమందలి దేవునిపేరు) వ్రాసుకొనె"నని సంతకముచేసి, ఆ ప్రతిని ఆలయమందిర సోపానములపై యుంచెను. శివుని దస్తూరీతోనున్న దానిని పురోహితులు చూచిరి. ఆ వార్త దవానలమువలె ఊరంతయు వ్యాపింపగా ఆశ్రమమున జనులు మూగిపోయిరి. అదిచూచి తన కంతటి గౌరవ మొనగూర్చిన ప్రభునిగూర్చి యతడు కీర్తనలు పాడెను. తనకీర్తనల కర్థము చెప్పుమని జనులు మాణిక్యవాచకరుని గోరగా, ఆలయములో చెప్పుదునని

వారిని తీసుకుపోయి, నటరాజునుచూపి, అతడే నాకీర్తనల కర్థమని చెప్పుచు నతడు గర్భగుడిలోనికిపోయి శివునిలో అంతర్హితుడయ్యెను. నది సాగరములో కలిసిపోయెను. అతని జీవిత మంత ఘనముగా నంతమయ్యెను.

తిరువాచకములో 51 ప్రకరణములు, 656 పాటలు నున్నవి. తిరుకోవైయార్‌లో 400 పాటలున్నవి. ఇది హృదయము ద్రవింపసేయు గ్రంథము. చతుర్విధమార్గములను, అందు ముఖ్యముగా సన్మార్గమును, మాణిక్యవాచకరు బోధించినాడు. ఈ మార్గమునుగూర్చి శివజ్ఞానసిద్ధియార్‌లో ఇట్లు చెప్పబడినది: "ఇతరమార్గముల పరిశీలించినమీదట సన్మార్గమే ఉత్తమమని తెలిసివచ్చును. భగవంతుడు పతి, జీవాత్మలు పశువులు, బంధముకే పాశములు. వీనిగూర్చిన శాస్త్రములు పఠించి, విని, మననముచేయవలెను. శివుని అనంత, శాశ్వత, సర్వవ్యాపక, సచ్చిదానందతత్వముతో తన అభేదము గ్రహించి జీవుడు అతనిలో లీనమగుటే మోక్షము." భగవంతుడే మాణిక్యవాచకరునకు గురువై యాథార్థ్యమును బోధించెను. మాణిక్యవాచక రనుసరించిన జ్ఞానమార్గమునే సన్మార్గమందురు. దీనిలో శైవమతమున ముఖ్యమైన మూడు అంశముల, (పతి పశుపాశములు) జ్ఞానమును, అపరోక్షానుభూతిజ్ఞానమును కలవు. జీవుని బంధములనుండి తొలగించి పరమాత్మలో జేర్చునదే ఈజ్ఞానము.

తిరువాచకములో మాణిక్యవాచక రనేక సందర్భములలో పాడిన పాటలున్నవి. శివుడు తనకు గురువై తన్ను రక్షించుట, గుఱ్ఱములు నక్కలగుట, శివుడు వైగైనది

గట్టుకు మట్టిపోయుట, మొదలగునవన్నియు నిందున్నవి. నలుగురు సమయాచార్యులలోను, మాణిక్యవాచకరు శైవ సిద్ధాంతములనుగూర్చి విశేషముగా విశదీకరించి చెప్పియున్నాడు. పతి, పశు, పాశములగూర్చి యితని కీర్తనలు వివరించును. శివుడే పతి. అత డద్వితీయుడు. అప్రమేయుడు; జీవుల కాదిమధ్యాంతములు తానేయయ్యు తా నాదిమధ్యాంత రహితుడు; సృష్టిస్థితిలయకారకుడు. మాయ నతడే కల్పించును; జ్ఞానము నతడే ప్రసాదించును. అన్నిమతముల కతడే గమ్యుడు. అతడనేక రూపములుదాల్చి భక్తుల కాపాడును. ప్రేమస్వరూపుడు. ఓం, మరియు పంచాక్షరీ మంత్రము లతని సార, స్వరూపములు. జీవాత్మ పరమాత్మ నుండి విడివడి క్రిమికీటక పశుపక్ష్యా మానవాదిరూపములు దాల్చును. అది ఆణవ, మాయ, కర్మలను బంధములలో తగుల్కొనును. పాపరహితుడగుటకు జీవాత్మ భక్తిప్రపత్తులతో భగవంతునివైపు తిరుగవలెను. మాణిక్యవాచకరు తానొక కుక్కనని అంతకన్న నికృష్టుడనని చెప్పుకొనును. శివకృపలేనిది ముక్తిలేదు. ఆత్మ పరిశుద్ధము కావలెను. నిశ్చల నిరంతర భక్తి కావలెను. ప్రతివారును కన్నప్ప చండీశ్వరులవలె సిద్ధపురుషులగుట సాధ్యముకాకపోయినను, వారిని తమ ఆదర్శముగా నుంచుకొనవలెను. సత్కార్యాచరణవల్లను, భక్తిజ్ఞానములవల్లను పాపము తొలగి జీవుడు శివైక్యము పొందగల్గును.

తిరుక్కోవైయార్ తమిళముననున్న కోవై సారస్వతములో మణిపూసవంటిది. అనుభవించినవారికేగాని అర్థము

కాని అనుభవములగూర్చిన సారస్వతమే కోవై సారస్వతము. జీవాత్మ పరమాత్మల సంబంధము తెలుపుటకు ప్రేయసీ ప్రేయసుల దృష్టాంతము వాడుట మామూలు. తిరుక్కోవైయార్‌లో అట్టిభావమున్నది. సంయోగానందము, వియోగ దుఃఖము మధురకవిత్వముతో వర్ణింపబడినవి. ''దీనిని బ్రాహ్మణులు వేదమందురు. యోగు లాగమ మందురు. ప్రేమకులు దీనిని మానవప్రేమకు ధర్మశాస్త్రసంక్షేప మందురు. తార్కికులు తర్క మందురు. కవులు లాక్షణిక గ్రంథమందు''రని ఒక శ్లోకము దీనిని వర్ణించుచున్నది.

మాణిక్యవాచకర్ ప్రథమశ్రేణికి చెందిన జ్ఞానకవి. ప్రశస్తమైన భాషలో శివుని కీర్తించి మానవహృదయములలో పారమార్థిక పరివర్తనము కావించెను. అతని అమరకవిత్వ మెప్పటికిని జీవుల నుత్తేజపరచి భగవంతునివైపు నడిపించు చుండును. తిరువాచకమున కాంగ్లానువాదము చేసిన రివరెండు జి. యు. పోప్, ''దక్షిణదేశమున కొక సాకార పరబ్రహ్మము, ఒక అమరత్వ అభయప్రదానము. ఒక ప్రార్థనాప్రోద్బలము మాణిక్యవాచకరు కీర్తనలలో లభించె'' నని వ్రాసియున్నాడు.

---

# నమ్మాళ్వారు

దక్షిణాదిని శైవమతమునకు నాయన్మారెటువంటివారో, శ్రీవైష్ణవమతమున కాళ్వారు లటువంటివారు. 'ఆళ్వారు' అనగా దైవజ్ఞానములోను, ప్రేమలోను, ఆనందములోను మునిగిపోయినవాడని అర్థము. పన్నిద్ద రాళ్వారులును విష్ణుమూర్తియొక్క అనుచరగణమే. ఆదిశేషుడు, గరుడుడు మొదలగు అనుచరులును, శంఖము, చక్రము మొదలగు పరికరములును పన్నిద్దరాళ్వారులై అవతరించిరని వైష్ణవ మతవిశ్వాసము. తామ్రపర్ణి, కృతమాల (వైగైనది), పయస్విని (పాపనాశిని), కావేరీ మొదలగు దక్షిణదేశ నదీ తీరములందు కలికాలములో శ్రీమన్నారాయణుని భక్తులగు సిద్ధపురుషు లవతరింతురని భాగవతములో చెప్పబడినది. శ్రీముష్ణమాహాత్మ్యములో ఈ సిద్ధపురుషు లన్నిజాతుల లోను జన్మించి ద్రవిడకీర్తనలు రచించి పరమాత్ముని మహిమ ప్రకటింతురని చెప్పబడెను.

ఆళ్వారులు రచించిన పాశురముల సంపుటికే దివ్య ప్రబంధమనిపేరు. దానిలో వెయ్యేసి కీర్తనలుగల నాలుగు భాగములున్నవి. అందుచే దానికి నాలాయిరప్రబంధమని కూడ పేరు కలదు. అనగా నాలుగువేళ పాశురములున్న గ్రంథమని అర్థము. దీనిలో రహస్యత్రయముగూర్చి చెప్ప బడెను. మొదటి రెండు వేలును తిరుమంత్రరహస్యమును

గూర్చి చెప్పును. తరువాతి వెయ్యి పాశురములు "చరమ శ్లోకము"నుగూర్చి చెప్పును. నాల్గవభాగము ద్వయమంత్ర మును వివరించును. తిరుమంత్రములో మూడేపదములుండును. వానిలో మొదటి రెండుపదములు, "ఓం నమః". వీనిగూర్చి మొదట వెయ్యి పాశురములు తెల్పును. రెండవ వెయ్యి పాశురములు మూడవపదమగు "నారాయణ" పదార్థమును గూర్చి చెప్పును. చరమశ్లోకమనగా భగవద్గీతలో భగవా నుడు చివర చెప్పిన శ్లోకము. జీవులను భగవంతునకు ఆత్మార్పణము చేసుకొమ్మని ఆ శ్లోకము చెప్పుచున్నది. ద్వయమంత్రములో రెండువాక్యములున్నవి. ఇవి సాధనను గూర్చియు సాధ్యముగూర్చియు, ముక్తి లక్ష్మీదేవిద్వారానే సాధ్యమనియు చెప్పును.

ఆళ్వారులలోకెల్ల గొప్పవారు నమ్మాళ్వారు. ఈయన రచించినవే నాలాయిరములోని మూడవభాగమగు తిరువాయ్ మొజియు, నాల్గవభాగములో కొంతభాగమును. వేదాంత దేశికుడు తిరువాయ్ మొజికి 'ద్రవిడోపనిషత్తు' అని పేరు పెట్టెను. రామానుజులు, ఆయన వెనుక వచ్చిన ఆచార్యు లును దీని కనేక వ్యాఖ్యానములు వ్రాసిరి. వానికి ఆరాయిరప్పడి, పన్నిరాయిరప్పడి, ఇరుపత్తునాలాయి రప్పడి, లేక ఈడు అని పేర్లు. ఆచార్యహృదయమనునది తరువాత రచింపబడిన వ్యాఖ్య. వేదాంతదేశికులుకూడ ఒక విపులవ్యాఖ్య వ్రాసిరి.

నమ్మాళ్వారు జీవితమున కాధారగ్రంథములు దివ్యసూరిచరిత్రము, ప్రపన్నామృతము, గురుపరంపరా

ప్రభావము, ప్రబంధసారము, ఉపదేశరత్నమాల, పళనడై విలక్కం. ఇతర సిద్ధపురుషుల జీవితములలో వలెనే, నమ్మాళ్వారు జీవితములోకూడ చరిత్రమేదో పుక్కిటిపురాణ మేదో తెలిసికొనుట కష్టము.

నమ్మాళ్వారు ఆత్మ అనియు, మొదటి ముగ్గురు ఆళ్వారులును మనస్సనియు, తక్కిన ఆళ్వారులు దేహమనియు వైష్ణవసాంప్రదాయము. కలియుగారంభమున విష్ణుప్రధానానుచరుడగు విష్వక్సేనుడు నమ్మాళ్వారుగా జనించి, విష్ణుభక్తిప్రచారము చేయునని భవిష్యపురాణములో చెప్పబడినది. నమ్మాళ్వారు జన్మస్థానము శ్రీనగరి (తిరునగరి) అని బ్రహ్మాండపురాణములో నున్నది. అది పాండ్యరాజ్యమున తామ్రపర్ణితీరమున నున్నది. ఇప్పుడు దీనిని నమ్మాళ్వారు పేరుమీాద, 'ఆళ్వారు తిరునగరి' అని పిలుతురు.

తిరునగరికి తిరుక్కురుగూర్ అనికూడ పేరు కలదు. దానిని కారియూర్ అను నొక నాయకుడు పాలించుచుండెను. అతడు తిరువన్ పరిసరప్రాంతమందలి ఉడైయనంగై యూర్ అను నామెను పెండ్లాడి యింటికి కామెను తీసుకువచ్చుచు దారిలో తిరుక్కురుంగుడి దేవాలయమును దర్శించెను. ఆ దేవాలయము పడమటి కనుమలలోని మహేంద్రగిరులకు దగ్గరగా నున్నది. అందలి దేవునిపేరు నంబి. వధూవరులు దేవుని తమకొక పుత్రుని ప్రసాదింపుమని ప్రార్థించిరి. తానే వారికి కుమారుడుగా పుట్టుదునని దేవుడు వారికి తెలియజేసెను. అట్లు పుట్టిన వాడే నమ్మాళ్వారు. నమ్మాళ్వారు అనగా "మనయొక్క

సిద్ధపురుషు''డని అర్థము. అతడు ఏడవశతాబ్దమునకు తొమ్మిదవశతాబ్దమునకుమధ్యవాడని పండితులు నిర్ణయించిరి.

విష్ణువుకౌస్తుభముయొక్కయు విష్వక్సేనునియొక్కయు అంశములతో నమ్మాళ్వారు జనించిరందురు. అతడు అష్టాంశములతో (విష్ణువు, అతని అయిదు ఆయుధములు, ఆదిశేషుడు, విష్వక్సేనుడు) పుట్టెననికూడ చెప్పుదురు. దీనిబట్టి వైష్ణవ సిద్ధపురుషులం దతనికున్న ఉన్నతస్థానము తెలియవచ్చుచున్నది.

అతడు సామాన్య శిశువుకాడు. గర్భములోనున్నంత కాలము శిశువునకుగల జ్ఞానమును శఠ అను వాయువు శిశువు పుట్టుకతోనే కప్పివేయును. కాని నమ్మాళ్వారు నా వాయువు కప్పలేదు. దానిని జయించినవాడగుటచే నమ్మాళ్వారునకు శఠకోపు డను బిరుదువచ్చెను. శిశువుగా నతడేడవక, పాలుత్రాగక, అవయవముల కదుపకుండుటచే తల్లిదండ్రుల కాశ్చర్యముగా నుండెను. కాని శిశువు మౌనముగా, గంభీరముగా, ప్రకాశమానముగా, మధురముగా గానవచ్చుచుండెను. ఆ శిశువు నెట్లు పెంచవలెనో వారికి తెలియకుండెను. పుట్టిన పండ్రెండవదినమున వారు శిశువును తిరునగరిలోని దేవాలయములోనికి తీసుకొనివెళ్లి మారన్ అని పేరుపెట్టిరి. రత్నఖచితమైన బంగారుతొట్టిలో ఆలయముననున్న చింతచెట్టుక్రింద పరుండబెట్టిరి. ఆ చెట్టు ఇప్పటికి ఆదిశేషు నవతారముగా భావింపబడుచున్నది.

ఆ చెట్టుక్రిందనే పదియారుసంవత్సరములు నమ్మాళ్వారు కళ్లుకాని నోరుకాని విప్పకుండ ఉండిపోయెను. తల్లిదండ్రులు

దీనికి కారణము తమ అపరాధమేదో యైయుండుననుకొనిరి కాని భగవంతునిగూర్చి తెలిసినవారెవ్వ రతనివద్దకు రాని కారణమున చూచుటకుగాని మాట్లాడుటకుకాని అవసర మతనికి కలుగకపోయెనని వారికి తెలియలేదు. అతడు దైవ జ్ఞానములోను దైవప్రేమలోను నిమగ్నుడై సమాధిలోనే ఉండెడివాడు. చివరకు నమ్మాళ్వారు ఘనతనెరిగిన మధురకవి ఆళ్వారు అను జ్ఞాని అతనివద్దకు వచ్చెను.

సమీపముననున్న తిరుక్కోలూర్ నం దొక బ్రాహ్మణ కుటుంబమున మధురకవి జన్మించెను. అతడు కుముద గణేశు నవతారమందురు. అతడు వేదశాస్త్రములు పఠించెను. చక్కని కవితాధార కలవాడు. అందుకే మధురకవి అని బిరుదు కలెగెను. విష్ణుభక్తితో నతడు తీర్థయాత్రలు కావించెను. అయోధ్యలో శ్రీరామచంద్రునిసేవలో కొన్నాళ్లు గడిపెను. ఒకనాటిరాత్రి యతడు దక్షిణదిక్కునగల తన జన్మస్థానమువైపు చూచుచుండగా ఒక గొప్ప కాంతి అతని కగుపించెను. అదేమో తెలుసుకొనదలచి ఆ దిక్కునకునడువ సాగెను. చివరకు తిరుక్కురుగూరుకువచ్చి నమ్మాళ్వారు సమాధిలో కూర్చుండిన చింతచెట్టులోనుండి ఆ కాంతి వచ్చు చున్నట్లు కనుగొనెను. ఆ కూర్చున్నవాడు తెలివిలోనున్నది లేనిది తెలుసుకొనుట కతని ఎదుట మధురకవి ఒక రాయి నెత్తి పడవేసెను. నమ్మాళ్వారు కళ్లు తెరిచి చూచెను. మధురకవి ఆయన నిట్లు ప్రశ్నించెను: ''చనిపోయినదాని నుండి సూక్ష్మముపుట్టి యేమి తినును, ఎక్కడ పడుండును?'' మొదటిసారిగా అప్పుడే నోరువిప్పి నమ్మాళ్వారు, ''దానినే

తినుచు, అక్కడే పడిఉండు''నని చెప్పెను. దానితో ఆయన యెడల మహాభక్తి కుదిరి మధురకవి సాష్టాంగనమస్కారము చేసి తన్ను శిష్యునిగా స్వీకరింపుమని కోరుకొనెను. మధుర కవియెడల ప్రేమజూపి, అతనిసేవ గ్రహించి, నమ్మాళ్వా రతనికి వైష్ణవమత రహస్యములు బోధించెను.

నమ్మాళ్వారునకు లక్ష్మీసమేతుడైన విష్ణువు గరుడా రూఢుడై దర్శనమిచ్చెను. వివిధ ఆలయములలో గల తన వివిధ రూపముల దర్శనముకూడ కలుగజేసెను. అమృత మధురపాశురములలో నమ్మాళ్వారు భగవంతుని కీర్తించెను. చింతచెట్టుక్రిందనున్న నమ్మాళ్వారును చూచుటకు దేవతలు సిద్ధులు వచ్చిరి. ఆ పాశురములకే రాగములు కూర్చి మధుర కవి ప్రజాహితార్థము పాడి వినిపించెను. స్వయముగా మధుర కవి తన గురువునుగూర్చి కణ్ణినుణ్ చిరుత్తాంబు అను కీర్తన రచించి పాడెను. అది మొదటి వెయ్యి కీర్తనలలో నున్నది. చింతచెట్టుక్రిందనే ధ్యానములో కాలము గడుపుచు నమ్మాళ్వారు తన ముప్పదియైదవయేట పరమపదించెను.

ఆయన రచించిన తిరువాయ్మొజి నాలాయిరగ్రంథము లోని మూడవభాగము. దీనిని సామవేదసారమందురు. తిరువిరుత్తం, తిరువాసిరియం, పెరియతిరువంతాది అను మరి మూడు గ్రంథములుకూడ రచించెను. అవి నాల్గవభాగములో నున్నవి. ఆ మూడును ఋగ్యజురాధర్వవేదముల సార ములు. శ్రీవైష్ణవములోని అర్థపంచకముల నతడు తన పాశురములలో వివరించెను. భగవంతుడు, జీవాత్మ, సాధన, సాధ్యము, సాధ్యవిరోధి యనునవే ఆ యైదును. నారాయణుడే

పరమప్రభువు. సమస్తకల్యాణగుణాస్పదుడు. మంగళధాముడు. ఆత్మలును,పదార్థప్రపంచమునుఅతని విశేషణములు. అతడే సృష్టిస్థితిలయ కారకుడు. సృష్టిస్థితిలయము లతని లీల. సమస్త జగత్తు కతడు మూలము. మనము వివిధనామరూపములతో నతనినే భజించుచున్నాము. మన మితరదైవముల భజించుచున్నా మనుకొందుము. కాని సర్వదేవనమస్కారము లతనికే చెందును.

పరిపూర్ణప్రపత్తియే ముక్తికి మార్గము. పూర్ణ ఆత్మార్పణము చేసుకొనవలెను. అహంకారశూన్యుడై నరుడు సదా భగవంతునే ధ్యానింపవలెను. అతడే గమ్యమని తన్నంకితమొనర్చుకొనవలెను. ఆత్మార్పణమే అన్నింటికన్న సులభమైన పటిష్ఠమైన పద్ధతి. ఆత్మార్పణము చేసుకొన్న వానిని భగవంతుడు తనకరుణాలో ముంచియెత్తును; పవిత్రు నొనరించును; అన్ని అడ్డంకులు తొలగించి మోక్షమిచ్చును.

మనల నుద్ధరించుటకై కరుణతో తిరిగి తిరిగి యవతరించు భగవంతుని దయను నమ్మాళ్వారు కీర్తించెను. మోసములోపడి చావక భగవంతునివైపు నడువుడని నరులను హెచ్చరించెను. ధనికుల స్తుతిలో మీ కవిత్వము వెచ్చింపక భగవంతునిగూర్చి పాడుకొనుడని కవులకు హితము గరపెను. నమ్మాళ్వారునకు కృష్ణు డభిమానదేవత. మధురభావ మతని యభిమానసాధన. జీవాత్మ భగవంతుని వధువు. భగవంతుడే ఆత్మ కాహారపానీయములు. అతడే ఆత్మ కానందము. భక్తికి పరమోత్కృష్ట తార్కాణము బృందావనగోపికలు వారిమార్గ మవలంబించు భక్తునికి కృష్ణసాంగత్య మబ్బును

కృష్ణవియోగముచే భక్తుడు కృశించిపోవును. భక్తునిప్రేమ కొరకు భగవంతుడుకూడ ఆకలిగొనియుండును. తనలోని భాగమే యగు భక్తునియొక్క సంశ్లేష మతడు వాంఛించును.

తన దివ్యప్రేమానుభూతిలో పాడుకొనుచు నమ్మాళ్వారు తన ఆనందములో నందరిని పాల్గొనుడని వేడుకొనును. బ్రహ్మానందమును విడిచి జనులు దుఃఖములకే దారితీయు చంచలసుఖము లేల కోరుదురని ఆశ్చర్యపడును. "భగవంతుని కీర్తింపుడు. అతని కంకితము కండు. అతని ఘనత పొగుడుడు. అతని నామము జపింపుడు. మిమ్ముల నతడు రక్షించును. కాపాడును" అని నమ్మాళ్వారు మనల హెచ్చరించుచున్నాడు.

# ఆండాళ్

మధురభావమునకు ఆళ్వారులలోకెల్ల ఆండాళే అత్యుత్తమ ఉదాహరణ. ఆమె స్త్రీయగుట దీనికి మరింత సాయపడెను. మధురభావసాధన కష్టసాధ్యమైనది. ఉపనిషత్తులు బ్రహ్మమును పరమానందమనియు, మహామధురరసమనియు కొనియాడినవి. భక్తిగ్రంథములు లతనిని మన్మథ మన్మథుడనియు, భువనసుందరుడనియు వర్ణించినవి. భక్తులనేకు లతనిని భర్తగా నూహించుకొని ప్రేమింతురు. వలపు, వివాహనిశ్చయము, వివాహము, విరహము, ఆవేదన, పునస్సమాగమము మొదలగు ప్రణయలీలలన్నియు వారి భక్తిమయ జీవితములలో నడచును. భగవంతు డొక్కడే పురుషుడు. స్త్రీలుగాని పురుషులుగాని భక్తులందరు భగవంతుని వధువులే. స్త్రీభక్తురాండ్రకీ మధురభక్తి సులభసాధ్యము. పత్నీభావము వారికి సహజముకదా! భగవంతుని పత్నులందు ఆండాళు దగ్రస్థానము. పసితనమునుండియు ఆమె భగవంతునికి తన్ను పూర్ణాత్మార్పణము చేసుకొనెను.

మధురకు యేభై మైళ్ల దూరములో శ్రీవిల్లిపుత్తూరు అను గ్రామమున్నది. విల్లి, కాంతన్ అను ఇద్దరన్నదమ్ములు వేటకాండ్ర నాయకులు. అచటి అడవిని కొట్టి గ్రామము నిర్మింపుడని వారికి దైవాజ్ఞ యయ్యెను. వారే శ్రీవిల్లి

పుత్తూరు గ్రామము నడవులగొట్టి నిర్మించిరని పురాణగాథ. పెరియాళ్వా రనబడు విష్ణుచిత్తుడును, ఆయన కుమార్తెయగు యాండాళును ఇచటనే జన్మించిరి.

గరుడు నంశమున విష్ణుచిత్తు డొక బ్రాహ్మణకుటుంబమున జన్మించెను. కృష్ణు డతని కిష్టదైవము. వాత్సల్యమతని అభిమానభావము. భగవంతునకెట్టి సేవచేతునా అని అత డాలోచించుచుండగా, శ్రీకృష్ణుడు కంసుని చంపుటకు బోవుచు, దారిలో మాలాకారుడిచ్చిన పూలదండ నతిప్రీతితో గ్రహించుట తలపునకు తట్టెను. అంతటినుండి విశేషము తులసిమొక్కలుగల పూలవనము పెంచి ప్రతిదినము శ్రీవిల్లిపుత్తూరులోనున్న స్వామికి పూలదండలు సమర్పించుచుండెను. అత డేశాస్త్రములు పఠించినవాడు కాడు. ఒకనా డతనికి స్వామి కలలో కన్పించి మధురలో పాండ్యరాజు, వల్లభదేవు డేర్పరచిన పండితసభలో వైష్ణవమతాధిక్యమును స్థాపింపుమని ఆజ్ఞాపించెను. విష్ణుచిత్తు డట్లే చేసి వాదములో గెలిచెను. రా జతనిని బహూకరించెను. అంద రతనిని సాటిలేని గురువని ప్రశంసించిరి. గరుడవాహనమున లక్ష్మీసమేతుడై దేవతాగణముతో స్వామి యతనికి దర్శనమిచ్చెను. ఈ మహోజ్వలదృశ్యమునుచూచి విష్ణుచిత్తు డానందపరవశుడైపోయెను. కాని స్వామి క్షేమముగూర్చి భయపడెను. బిడ్డని క్షేమముగూర్చి తండ్రి బెంగపడునట్లు విష్ణుచిత్తునకు బెంగ కల్గెను. ఈ పాడుప్రపంచములో స్వామి కనబడుటచే ఆయన అందమునకు, శక్తికి, ఘనతకు దృష్టి తగులునేమో అను బెంగ కల్గెను. తత్క్షణ మతడు స్వామి

కే అపాయము రాకుండ దీవించుచు, తిరుప్పల్లాండు అను కీర్తన గానముసేసెను. అందరిని తన ఆశీర్వాదగీతములో పాల్గొనుడని వేడుకొనెను. భగవంతునే దీవించగల సమర్థత గల్గుటచే విష్ణుచిత్తునకు పెరియాళ్వారు అను బిరుదు కల్గెను.

శ్రీవిల్లిపుత్తూరునకు విష్ణుచిత్తుడు తిరిగివచ్చి ఆలయ సేవ చేయుచుండెను. ఒకనాడు తనతోటలో తులసి మొక్కలు నాటుటకొరక మడి త్రవ్వుచుండగా శిశువుకన్న పెద్దదగు ఒక విచిత్ర బాలిక తులసిచెట్టు మూలమున పరుండి ఉండుట చూచెను. జనకునికి సీతవలె యామె యతనికి భగవత్ప్రసాదమే. అతనికి బిడ్డలు లేరు. ఇంటికి తెచ్చి ఆమెకు గోదా అని పేరుపెట్టి ప్రేమతో పెంచుచుండెను. ఈమె కే తరువాత ఆండాళ్ అని పేరు. ఏడవశతాబ్దమధ్యకాలము నాటి దీ వృత్తాంతము.

ఆమె అందగత్తె. ఆటపాటలు, విద్యాబుద్ధులు నేర్చెను. ఆమె భూదేవి అంశమున పుట్టెనుగాన విష్ణునందు ప్రేమ ఆమెలో సహజముగానే వికసించెను. ఆమె భక్తికి పెరియాళ్వారుకూడ దోహదము సల్పుచుండెను. విష్ణుచిత్తుడామెకు సంస్కారకర్మ లాచరించి, వైష్ణవమత రహస్యములు బోధించి, విష్ణుని మహాత్మ్యము తెలియజేయుచుండెను.

శ్రీరంగమందలి స్వామికి తాను పత్నినని గోదా చిన్ననాటినుండి భావించుచుండెను. పెద్దదయినకొలది తన

స్వామికి తగినవధువుగా తయారగుటే ఆమెతలంపు. ప్రతి దినము తన తండ్రి శ్రీవిల్లిపుత్తూరు స్వామికొరకు తయారు చేయు పూలమాలలు ముందుగా తాను ధరించి, అద్దములో చూచుకొని, రంగనాథునకు తగిన అందగత్తెనని సంతృప్తి పడుచుండెను. తిరిగిమాలలుతీసి బుట్టలోనుంచెడిది. కూతురు ధరించినట్లు తెలియక పెరియాళ్వారు వానిని గొంపోయి స్వామి కర్పించెడువాడు. ఒకనాడీ అపచారము తెలిసికొని, కూతును గట్టిగా కూకలువేసి, ఆ దండలు స్వామికై తీసు కొనిపోలేదు. కలలోస్వామి అగుపించి దండలేల తీసుకురాలే దని అడిగెను. తనకూతు నపచార మతడు విన్నవింపగా, స్వామి అది అపచారముకాదనియు, ఆమెధరించిన మాలలే తన కత్యంత ప్రియములనియు సెలవిచ్చెను. పెరియాళ్వారు స్వామియాజ్ఞ కూతుకెరిగించి పూలమాలలు తానేముందుగా ఆమెచే ధరింపజేసి పిదప దేవాలయమునకు గొంపోవుచుం డెను. గోదా జగన్మాతయని యెఱింగి పెరియాళ్వారు ఆమెకు ఆండాళ్, జగద్రక్షకి అను పేరుపెట్టెను. తాను ధరించిన దండలు స్వామికర్పించుటచే ఆమెకు సూడికొ్కుడుత్తనాచ్చి యార్ అను పేరుకూడ వచ్చెను.

వయస్సుతోపాటు ఆండాళుకు స్వామిమీద ప్రేమ కూడ పెరుగుచుండెను. మేల్కొన్నంతసేపు ఆమెకు స్వామిని పెండ్లాడుతలంపులే; నిద్రలో స్వామి కలయికగూర్చిన సుఖ స్వప్నములే. బృందావనమున గోపికలతో శ్రీకృష్ణుడు యమునాతీరమున విహరించు టూహించుకొనెడిది. తానొక గోపికయై, తెల్లవారగనేలేచి, చెలికత్తెలనులేపి, యమునలో

స్నానముచేసి, నందగోపునింటికి తనహృదయస్వామియగు శ్రీకృష్ణు నారాధించుటకు పోయినట్లు భావించెడిది. మార్గశిర మందు కాత్యాయనీపూజ చేసి తన ఇష్టదైవముతో తన్ను కూర్చుమని దేవిని ప్రార్థించెడిది. భగవంతునితోనే తన్ను కలుపుమని కామదేవుని వేడుకొనెడిది.

కూతురుయొక్క భక్త్యావేశము హెచ్చినకొలది పెరియాళ్వారున కాందోళన హెచ్చెను. వివాహమొనర్చిన ఆమె కుదుటబడునని తలచి, నెమ్మదిగా ఆమెతో పెండ్లి ప్రసంగ మెత్తగా ఆమె భగవంతునితప్ప మనుష్యమాత్రుని పెండ్లాడ నని నిష్కర్షగా చెప్పెను. మనుష్యుని పెండ్లాడుమనిన మర ణింతుననియు, తన నిశ్చయమునకడ్డు లేదనియు ఆమె తెల్పెను. విష్ణ్వాలయములు వందలకొలది కలవు. వీనిలో ఏ స్వామి నాండాళు పెండ్లాడును? ఒకొక్క ఆలయమునందలిస్వామి మాహాత్మ్యముగూర్చి వరుసగా పెరియాళ్వా రామెకు వినిపించెను. రంగనాథుని తండ్రి వర్ణించుచుండగా ఆమె మనస్సు ద్రవించెను. ఆనందాశ్రువులురాలెను. ఒడలు కంపించెను. ఆమె మంత్రింపబడినట్లయిపోయెను. ఆమె మనస్సు రంగ నాథున కంకితమని తెలిసినది. కాని యీ పెండ్లి జరిపించు టెట్లు?

కలలో రంగనాథుడు విష్ణుచిత్తున కగపడి తానే పెండ్లి ఏర్పాట్లు చేయింతునని చెప్పెను. శ్రీవిల్లిపుత్తూరునకు సమస్త మర్యాదలతోను వెళ్లి తన వధువగు ఆండాళును తీసుకు రమ్మని స్వామి ఆలయార్చకుల కాజ్ఞాపించెను. భక్తులు,

అర్చకులు వెంటరా, పెరియాళ్వారు ఆండాళును పల్లకీలో కూర్చుండబెట్టి శ్రీరంగనాథాలయమునకు తీసుకువచ్చెను. గర్భగుడిలోనికి వెళ్లి రంగనాథుని మోహనాకారము చూచుటతోడనే ఆండాళ్ మన స్వామెను స్వామికడ కీడ్చి వేసెను; శేషపాన్పుననున్న స్వామికడకేగి, పాన్పునెక్కి, స్వామిప్రక్క నిలబడి, ఆమె ఆయనలో లీనమై అంతర్ధానమయ్యెను. అందరు అచ్చెరువోయిరి. పెరియాళ్వారు కండ్లనుండి ఆనందవిచారాశ్రువులు ధారలుగా కారెను. స్వామిలో కూతురైక్యమయ్యెనని ఆనందమే కాని తన్ను శాశ్వతముగా విడిచిపోయినదని పెరియాళ్వారునకు విచారము. "నీవు స్వామికే మామవైతివి. శ్రీవిల్లిపుత్తూరు వెళ్లి శ్రీరంగనాథ ఆండాళుల విగ్రహములు ప్రతిష్ఠించి భక్తిశ్రద్ధలతో పూజించుచు, శ్రీవిల్లిపుత్తూరు దేవాలయమునకు యథాప్రకారము సేవచేయుచుండు"మను భగవద్వాణి పెరియాళ్వారునకు వినిపించెను.

తిరుప్పావై, నాచ్చియార్ తిరుమొళి అను ప్రబంధములు ఆండాళ్ రచించెను. ఇవి వైష్ణవ దివ్యప్రబంధములో మొదటి వేయి పాశురము (పద్యము) లలోనివి. ఇవి రెండును శృంగారకావ్యములు. నిరాశ మొదలుకొని ప్రియసాంగత్యసౌఖ్యమువరకు గల ప్రియురాలి వివిధభావముల నిందామె వర్ణించెను. ప్రియుడిచట భగవంతుడు.

మార్గశిరమందు కన్యలు 'పావైనోన్బు' ఆచరింతురు. అనగా ప్రతి తెల్లవారఝామునను లేచి, తగిన వరుని పొందు

టకును, సర్వశ్రేయస్సు లందుకొనుటకును కాత్యాయనీపూజ ఆచరింతురు. బృందావనగోపిక లీ వ్రతము పూర్వము శ్రీకృష్ణుని పొందుట కాచరించిరి. తిరుప్పావైలో ఆండాళు తనొక్క గోపికగా భావించుకొని గోపికలకు శ్రీకృష్ణునెడగల భక్తిప్రేమల కీర్తించెను. ఈ గీతములలో భగవంతునకు తన్నాత్మార్పణము చేసుకొనెను. నీ దాసినై నీ యాజ్ఞల నెరవేర్చుచుందును. నన్ను నీవు గ్రహించిన చాలునని పాడును. ఇందు నెల (ముప్పది దినముల)కు సరిపడు ముప్పది పాశురములున్నవి. వానిలో కృష్ణునాగడములు, క్రీడలు, సాహసకృత్యములు అభివర్ణింపబడినవి. ప్రతి గీతమునకు "భక్తహృదయప్రేమ స్వీకరింపు" మను పల్లవి యుండును.

తిరుమొళిలోను భగవత్ప్రేమయే కథావస్తువు. ఇది తిరుప్పావైకన్న పెద్ద గ్రంథము. ఆండాళు తాను పెండ్లాడ దలచిన ప్రభువునెడ తన అపారప్రేమ నీ కావ్యములోని ప్రతి పదమునను వెలిబుచ్చెను. ప్రేమావిష్టయైన కన్య ప్రియుని పొందుట కేమేమి సేయునో అవిఅన్నియు ఆమె శ్రీకృష్ణుని పొందుట కాచరించెను. తనపక్షము వహించి తన్ను తన ప్రభువుతో కూర్చుమని కామదేవుని ప్రార్థించును. సఖులతో, పక్షులతో, మేఘములతో శ్రీకృష్ణునకు ప్రేమసందేశము లంపును. తన ప్రభువు తనగోడు వినకున్నాడని పంచభూతము లతో మొరలిడును. శ్రీకృష్ణుని పెండ్లాడినట్లు, అతనితో సుఖముగా కాపురము చేయుచున్నట్లు కలలు గాంచును. మేల్కాంచి తన కల సఖుల కెరిగించును. ప్రభువుకడకు

తన్ను గొంపొమ్మని వారిని వేడుకొనును. అలసటలేక తిరుగాడుచు కనుపించినవారినందరిని స్వామి యగపడెనా అని అడుగుచుండును. బృందావనములో స్వామిని చూచితి మని వారు చెప్పగా ధైర్యముతో పయనము కట్టును. ఆండాళు నాపాదమస్తకము కరిగించిన మధురభావమును నాయికాప్రేమను బహుసరళముగా రసవంతముగా నీకావ్యము చిత్రించెను.

# శంకరాచార్యుడు

నేటివలెనే శంకరుని కాలమునను అశాంతి, సాంఘిక కల్లోలము, భక్తిశూన్యత ప్రబలియుండెను. తనకాలదుస్థితిని గూర్చి శంకరుడు తన బ్రహ్మసూత్రభాష్యములో నిట్లు వ్రాసినాడు: "నేటివారు భగవంతునితో మాట్లాడలేకున్నారు, కాబట్టి పూర్వీకులు మాత్రము మాట్లాడియుండిరా అని సంకోచించుట, నేడు సార్వభౌములు లేరు కాబట్టి పూర్వము మాత్ర ముండిరా అని సంకోచించుటవంటిది. నేడు వర్ణాశ్రమ ధర్మములు సరిగా లేవు కాబట్టి పూర్వముకూడ లేవనుట వంటిది." శంకరుని కాలమున హిందూదేశమున చిన్నచిన్న రాజ్యము లేర్పడి ఆధిపత్యమునకై ఒకదానితో నొకటి పోరాడుచుండెను. సంఘమున భిన్న భిన్న కక్షు లేర్పడి హక్కులకొరకు పోరాడుచే కాని స్వధర్మము నెరవేర్చకుండెను. అసూయ, క్రోధము, స్వార్థము, అశాంతి, అరాచకము ప్రబలెను. కొందరు శాస్త్రములలోని పదము లనే పట్టుకొని వ్రేలాడుచు అసలు సారమును గ్రహింపకుండిరి. కొందరు నాస్తికులు సనాతనము పవిత్రమునగునదెల్ల వినాశన మొనర్ప బూనుకొనిరి. వేదాంతులలో వైషమ్యము, మత శాఖోపశాఖలలో వైరము విస్తరిల్లెను. పరమాత్మ ఒక్కడే అన్న వేదబోధ మరచి భిన్నదైవములనుగూర్చిన మూర్ఖ భావములతో ఒకరిపై నొకరు దండెత్తుచుండిరి. మతము

జీవితమునకు శాంతినిచ్చుటకు బదులు పోరాటములకు దారి తీసెను.

శంకరు డట్టి కల్లోలపరిస్థితులలో పుట్టెను. తన అల్పాయుష్కాలములోనే మంగళప్రదమైన మహనీయ పారమార్థికమార్గముచూపి మతవైషమ్యము లడచెను. ఆరితేరిన వైద్యునివలె రోగకారణము కనుగొని సరియైన మందు వాడెను. అదే అతని ఉపనిషత్సారమగు అద్వైత సిద్ధాంతము. సమస్తకాలముల కుపయోగించు నీ అద్వైత బోధ శంకరుని కాలమునకు ప్రత్యేకముగా మరింత అవసర మయ్యెను.

శంకర విలాసములని మాధవానందుడు, ఆనందగిరి, చిద్విలాసుడు, సదానందుడు వ్రాసిన గ్రంథములకు పుక్కిటి పురాణములే ఆధారములు. ఆ గ్రంథములు ఒకదాని కొకటి విరుద్ధముగా నుండును. పతంజలివిజయము, శివరహస్యము, బ్రహ్మాండపురాణము, స్కంధపురాణములలో శంకరుని జీవిత విశేషములు కొన్ని పేర్కొనబడినవి.

కేరళలో పూర్ణానది ఒడ్డున కాలాడి అను ఒక చిన్న పల్లె కలదు. అందు శివగురుడు, ఆర్యాంబ అను నంబూద్రి బ్రాహ్మణదంపతులు సంతానము లేక తిరుచూరులోని వృషాచలేశ్వరుని ప్రార్థింపగా నందనసంవత్సర వైశాఖ శుక్ల పంచమీ పునర్వసునక్షత్రమున వారికి శంకరు డుదయించెను. అది క్రీ. శ. 788 అని పండితులు నిర్ధారణచేసిరి. ఐదవయేట నతని కుపనయనమయ్యెను. బాలుడు మహాప్రజ్ఞావంతుడు. ఎనిమిదవయేటనే సకల లౌకిక పారమార్థికవిద్య లభ్యసించెను.

తండ్రి అతని యెనిమిదవయేటనే మరణించెను. తల్లి శంకరుని సన్న్యాసకాంక్ష కనిపెట్టి పెండ్లిచేసివేయదలచెను. కాని అతనికి ప్రపంచమం దభిమానములేదు. తనజీవితమును పరమార్థమునకే అంకితముచేసి, తన అనుభూతులను తోడి మానవులకు బోధించుటకే గాని నిరర్థక జీవితము గడుపుట కతడు జన్మింపలేదు. ఆటవస్తువులతో పిల్లలు సంబరపడు వయస్సులో అతడు సన్న్యసింపగోరెను. కాని తల్లి అనుమతి యిచ్చునా? ఏ తల్లి చేతులార బిడ్డను విడిచిపుచ్చును? ఒకనాటి ఉదయము తల్లియు, కుమారుడును నదికి స్నానమునకు వెళ్లగా కొడుకును మొసలి పట్టుకొనెను. ఆతురసన్న్యసము తీసుకొనుట కనుజ్ఞ ఇమ్మని తల్లిని శంకరుడు వేడుకొనెను. వేరుగతిలేక తల్లి ఒప్పుకొనెను. కాని వెంటనే మొసలి చిత్రముగా అతనిని విడిచి వెళ్లిపోయెను. ఏ అపాయము పొందక శంకరుడు సన్న్యాసము గ్రహించు దీక్షతో జలములనుండి యీవలకు వచ్చెను. తల్లిని విడిచిపోవునప్పుడు శంకరుడు తల్లికి అంతకాలమునవచ్చి సేవసేతుననియు, ఆమె అపరకర్మములు తానే సేతుననియు మాట ఇచ్చి వెళ్లెను.

ఎనిమిదేండ్లు నిండని శంకరుడిల్లు విడిచి గురువుకొరకుత్తరదేశమునకు పయనించెను. అతని ఆయుఃపరిమాణ మెనిమిదేండ్లేయైనను, ఒకనాడు అగస్త్యుడు, నారదుడు మొదలగు ఋషులు వారింటికివచ్చి వారి ఆతిథ్యమునుమెచ్చి, మరొక ఎనిమిదేండ్ల ఆయువు నతనికి ప్రసాదించిరని ఒక గాథ కలదు. నర్మదానదీతీరమున గౌడపాదశిష్యుడగు గోవింద భగవత్పాదుడు శిష్యగణముతో ఒకగుహలో నుండుటెరిగి

శంకరుడు వారికడకేగి సన్న్యాసమిమ్మని కోరెను. అట్టి శిష్యుడు దొరికినందు కానందముతో గురువు సమ్మతించి శంకరునకు సన్న్యాసాశ్రమమిచ్చి, వేదాంతోపదేశము చేసెను.

గురువుగారి ఆశ్రమములో శంకరుడుండగా ఒక మాహాత్మ్యము జరిగెను. నర్మదానది వరదలు గట్లు త్రెంచుకొని పొంగి పొరలుచుండెను. తీర గ్రామములవారు భయకంపితులైరి. శంకరుడు జలాకర్షణమంత్రముపఠించి, తన కమండలము నేలమీదనుంచి వరదలు తగ్గునట్లొనరించి ఆపద నివారించెను. నర్మద వరద నెవ్వడాపి కాపాడునో వాడే బ్రహ్మసూత్ర భాష్యము వ్రాయ నర్హుడని అత్రిమహర్షి మున్ను చెప్పిన మాట గోవిందపాదు డెరుగును. శంకరుని శక్తియు గ్రహించిన వాడగుటచే గురువు శంకరుని కాశీ వెళ్లి ప్రస్థానత్రయమునకు (బ్రహ్మసూత్రములు, ఉపనిషత్తులు, భగవద్గీత) భాష్యము వ్రాయుమని ఆదేశించెను.

పాండిత్యమునకు, పారమార్థికమునకు పేరుగన్న వారణాసిని శంకరుడు చేరుకొనెను. చోళదేశమునుండివచ్చిన విష్ణుశర్మ శంకరుని ప్రథమశిష్యుడయ్యెను. అతనికి శంకరుడు సనందుడను సన్న్యాసనామ మొసగెను. మరికొందరు శిష్యులును చేరిరి. వారిలో వారి కసూయలు పుట్టెను. సనందునెడల గురువునకు పక్షపాతమని కొందరు శిష్యులసూయపడిరి. సనందుని ఘనత శంకరుడు వారికి చూపదలచెను. శిష్యులతోకూడి శంకరుడొకనాడు నదీస్నానము చేయుచు తాను కట్టుకొనుటకు బట్టలు తెచ్చుచున్న సనం

డునిచూచి రమ్మని కేకవేసెను. తక్షణ మతడు నదీజలముల మీాద నడచుచువచ్చివేసెను. అతడు నీటిమీాద పెట్టిన ఒక్కొక్క అడుగుక్రింద ఊతగా ఒక్కొక్కపద్మము లేచు చుండెను. అందుచే అతనికి పద్మపాదుడనుపేరు కల్గెను.

శంకరుని మరి ఇద్దరు శిష్యులనుగూర్చికూడ ఇట్టి గాథలు కలవు. శంకరునికృపచే మాటలువచ్చునేమో అని తన మూగకుమారుని దివాకరుడు శంకరునివద్దకు తీసుకు వచ్చెను. నీవెవరవని శంకరుడా మూగ కుర్రవాని నడుగగా నతడు తక్షణము తాను ఆత్మననియు, మనస్సునకు దేహమునకు అతీతుడననియు, కొన్ని శ్లోకములు చెప్పెను. "సానిత్యోపలబ్ధి స్వరూపోహమాత్మా" అని ప్రతిశ్లోకము చివరను వచ్చును. చాల సంతోషించి శంకరుడాకుర్రవానికి సన్న్యాసమిచ్చి తనశిష్యునిగా చేసుకొనెను. అతనికి హస్తామలకుడని పేరుపెట్టెను; అనగా అరచేతిలో ఉసిరికాయవలె విస్పష్టమైన జ్ఞానముకలవాడని అర్థము. కళానాథుడను మరొక శిష్యుడు కలడు. అతడు శంకరునివద్దకు వచ్చి తన్ను శిష్యునిగా స్వీకరింపుమని కోరుచు శంకరుని తోతకవృత్తములలో కీర్తించెను. అతనినికూడ సన్న్యాస శిష్యునిగాగ్రహించి శంకరుడతనికి తోతకాచార్యుడని పేరు పెట్టెను.

కాశీలోని రెండు సంఘటనలు పేర్కొనవలసిఉన్నది. ఒకనాడు పవిత్రగంగాస్నానముచేసి శంకరుడు విశ్వనాథాలయమునకు శిష్యులతో పోవుచుండగా ఒక ఛండాలుడు కల్లుకుండలతోను, కుక్కలతోను సమీాపమునకు వచ్చుచుండెను. దూరముగా తొలగుమని శంకరుడతనిని హెచ్చ

రించెను. "దేహమా? ఆత్మా? ఏది దూరముగా తొలగ వలెను. అందరి దేహములు పాంచభౌతికములే కదా? ఆత్మ సర్వవ్యాపియయ్యు అందరియందును ఒక్కటే కదా!" అని ఛండాలుడు జవాబిచ్చెను. అతడు సాధారణ ఛండాలుడు కాడని శంకరుడు గ్రహించెను. నిజమున కతడు ఛండాలవేషముననున్న విశ్వనాథుడు. అద్వైతానుభూతి కలవాడు బ్రాహ్మణుడైనను ఛండాలుడైనను తనకు గురువే నని సాష్టాంగపడి శంకరుడు శివస్తోత్రము సేసెను.

ఒకనాడు శంకరుడు కాశీలో తిరుగుచు నొక చోట వ్యాకరణ సూత్రములను వల్లెవేయుచున్న ఒక పండితుని చూచి, "ఏల కాలము వృథాపుచ్చెదవు. భజగోవిందం, భజగోవిందం, గోవిందం భజ మూఢమతే. సంప్రాప్తే సన్నిహితేకాలే" అను చక్కని గీతములను పాడెను.

ఛండాలవేషమునవచ్చిన శివునాజ్ఞప్రకారము శంకరుడు హిమాలయమున బదరికాశ్రమమునకు బోయి వ్యాసుని సందర్శించి, అతని దీవన పొందెను. అచట పరమగురు గౌడపాదునికూడ దర్శించి దీవన పొందెను. తిరిగి కాశీవచ్చి భాష్యములు, ఇతర గ్రంథములు రచించెను. శంకరుడు మణికర్ణికా ఘట్టమున ముక్తిమంటపమున కూర్చుండి గ్రంథరచన చేయుచు, శిష్యులకు బోధించుచు నుండువాడు. మొదట శంకరుడు విష్ణుసహస్రనామవ్యాఖ్యవ్రాసెను. పిదప ప్రస్థానత్రయముపై భాష్యములు వ్రాసెను. తన బ్రహ్మసూత్ర భాష్యమును శంకరుడు శిష్యులకు బోధించుచుండగా వ్యాసు డొక వృద్ధుని వేషమునవచ్చి భాష్యముపై శంకరునితో దీర్ఘముగా

వాదింపసాగెను. శివాంశమునపుట్టిన శంకరునకు,విష్ణ్వంశమున పుట్టిన వ్యాసునకును వాదముకల్గిన శాంతి యెక్కుడిది, విరమింపుడని పద్మపాదుడు వారిని ప్రార్థించెను. తన్ను వ్యాసునిగా వారు గుర్తించినమీదట వ్యాసుడు శంకరుని భాష్య మామోదించి, శంకరుడు ముప్పదిరెండు సంవత్సరములవరకు జీవించునట్లు దీవించెను. దేశమంతట సంచారము చేసి వేదాంతమును బోధింపుమని వ్యాసుడు శంకరుని కోరెను.

శంకరుడు కాశీవిడిచి త్రివేణీ సంగమప్రదేశమగు ప్రయాగను సందర్శించెను. అచట పూర్వమీమాంసా వాదియగు కుమారిలభట్టుతో వాదించి దానిలోని లోపములు శంకరుడు చూపదలచెను. కాని భట్టు వాదించుస్థితిలో లేడు. బౌద్ధుల నోడించు నుద్దేశముతో బౌద్ధవేషముదాల్చి బౌద్ధగురువులవద్ద వారి ధర్మములు భట్టు నేర్చినందు కిప్పుడు చింతించి కర్మకాండలో పూర్ణ విశ్వాసము కలవాడు కాన ఆత్మహత్యయే తన మోసమునకు తగిన శిక్షయని నిశ్చయించి అగ్నిప్రవేశము చేయదలచెను. అతని స్థితిచూచి శంకరుడు చింతిల్లెను. మాహిష్మతీ పట్టణమునకు వెళ్లి అచట మండన మిశ్రునితో వాదింపుమని భట్టు శంకరుని పంపివేసెను.

మండనమిశ్రుడు గట్టి మీమాంసావాది. వాగ్వాద నిపుణుడు. వేదపండితుడు. శంకరుడు మండను నింటికి వెళ్లినపుడు తలుపులు బిగించియుండెను. లోన మండనుడు శ్రాద్ధకర్మ నాచరించుచుండెను. యోగశక్తిచే శంకరుడు లోనికి పోయి మండనుని వాదమునకు పిలిచెను. శంకర మండన

సంవాదము శంకరుని జీవితములో నొక మనోహర ఉపా ఖ్యానమువంటిది. కర్మకాండయే వేదములో ముఖ్యభాగమని మండనుని వాదము. బ్రహ్మమునుగూర్చి, ఆత్మనుగూర్చి తెలుపు ఉపనిషద్భాగమే ముఖ్యమని స్థాపింపదలచి శంకరుడు వాదమునకు గడంగెను.

మండనుని భార్య భారతి పండితురాలు. ఆమెయే వీరివాదమునకు మధ్యస్థురాలు. ఆమె వారిద్దరి మెడలలోను పూలమాలలువేసి యెవరిమాల ముందు వాడిపోవునో వా రోడినట్లని చెప్పెను. వాదము కొన్నినాళ్లు గడచెను. మండ నునిమాల వాడదొడగెను. తానోడిన ట్లొప్పుకొని మండ నుడు శంకరుని సన్న్యాసశిష్యుడగుట కంగీకరించెను.

తన్నుకూడ ఓడించిన కాని శంకరుని విజయము పూర్తి కాదని భారతి వాదించెను. శాస్త్రవిషయము లనేకములు వారు చర్చించిరి. శంకరునిదే పైచేయిగా నుండెను. శంకరుని జీవితము వ్రాసినవా రిచట ననవసరముగా నొక ఉపాఖ్యా నము కల్పించిరి. శంకరు నెట్లైనను ఓడింపదలచి భారతి కామశాస్త్రముపై ప్రశ్నలు వేసెనట. తనకు తెలియదని శంకరు డొప్పుకొని జవాబు లిచ్చుటకు వ్యవధి కోరెను. అప్పుడే అమరకు డను రాజు మరణించెను. శంకరు డతని దేహములో యోగశక్తిని ప్రవేశించి రాణులతో నివసించుచు రాజ్యము చక్కగా పాలించుచుండెను. రాజు సన్నిహితులు కొంద రిత డెవ్వరో యోగి పరకాయప్రవేశముచేసియుండు నని శంకించి, యతడు తిరిగి తన దేహములోనికి వెళ్లిపో కుండుటకై యోగి శవమును వెదకి కాల్చివేయుటకు రహస

ముగా కొందరిని పంపిరి. వారు చివరకు సాధించి శవమును కాల్చదొడగిరి. ఇంతలో శిష్యులు రాజుగానున్న శంకరుని చేరి పూర్వాశ్రమము జ్ఞాపకముచేసిరి. తత్క్షణము శంకరుడు పూర్వదేహమును ప్రవేశించి లక్ష్మీనృసింహస్తోత్రముచేసి యే యపాయము లేకుండ చితినుండి లేచివచ్చెను.

అంత తిరిగి మండను నింటికివెళ్లి శంకరుడు భారతి నోడించెను. మండనుడు శంకరుని శిష్యుడై సన్న్యాసము గ్రహించి సురేశ్వరు డను పేరుపొందెను. భారతికూడ శంకరుని పరివారములో చేరెను.

తల్లి కవసానకాలము సమీపించినదని తెలుసుకొని, తన వాగ్దానము ప్రకారము శంకరుడు కాలాడికి వెళ్లెను. కొడుకునుచూచి తల్లి మహానందము పొందెను. శంకరుడు తా నిప్పుడు గురువై తల్లికి జ్ఞానోపదేశముచేసి నిశ్చింతతో నామె మరణించున ట్లొనర్చెను. కొన్నాళ్లు గృహస్థము నడపక సన్న్యాసియైనందుకే బంధువులకు శంకరునిపై కోప మున్నది. ఇప్పుడు సన్న్యాసియై తల్లికి శ్రాద్ధకర్మలుచేయుట కెట్లొప్పుకొందురు? వా రతనిని బహిష్కరించిరి. శంకరుడు తల్లి దేహము నొక్కడు మోయలేక ఖండించి, దొడ్డిలో నొకమూలకుజేర్చి, అరటి బోదెలతో తనయోగాగ్నిద్వారా దహనముచేసెను. చాలకాలమువరకు శంకరుని శాపమువల్ల నంబూద్రిబ్రాహ్మణులు శవములను ఖండించి దొడ్లలోనే దహనముచేయుచుండిరి. ఇటీవల శంకరపీఠాధిపతి యొక శాపము తొలగించిరి.

శంకరుడు దిగ్విజయయాత్రకు బయలుదేరెను; మూడు సార్లు హిందూదేశమునంతను చుట్టివచ్చెను. వెళ్లినచోటనెల్ల బోధనలద్వారా, వాదములద్వారా, ఆత్మానుభవశక్తిద్వారా ప్రతిపక్షులను తనవైపు త్రిప్పుకొనుచుండెను. సూత్రభాష్యమునకు చివర సూచనప్రాయముగా తన్నుగూర్చి శంకరుడిట్లు వ్రాసెను: "బ్రహ్మజ్ఞానము పొందిన జీవన్ముక్తుడని తమ హృదయములకు తట్టుచుండగా కాదని ఎవరనగలరు?"

మిథ్యావాదములు చెలరేగుచున్న కాలమున, నాస్తికవాదములను ఖండించుటకు సనాతనమతములో పూజాపురస్కారములు తప్ప వేరే పస లేనికాలమున శంకరుడు ఉపనిషచ్ఛృంగములనుండి వేదాంతామృతవాహినిని మానవలోకమునకు తెచ్చియిచ్చెను.

శంకరుడు బోధించిన అద్వైతము ఇతర వేదాంతసిద్ధాంతములకు విరుద్ధమైనది కాదు. ద్వైతసిద్ధాంతమునకు అద్వైతసిద్ధాంతమునకు విరోధముండనక్కరలేదని గౌడపాదుడిదివరకే బోధించియున్నాడు. రెండింటిలోను ఉన్నతమైనది తక్కువదానికి వ్యతిరేకము కానక్కరలేదు. క్రిందిదానిలోని సారముకూడ గ్రహించి రెండవది మరింత బలపడును. తన యవయవములతో తానే యెవ్వడును పోరాడనట్లు అద్వైతమితర వేదాంతసిద్ధాంతములతో తగవులాడదు. పూర్ణత్వమును ఏకత్వమును గ్రహించిన శంకరుడు భిన్నత్వములతో తగవులాడుకొనుచున్న తనకాలమువారికి భిన్నము లెట్లు పూర్ణములో భాగములో కూర్చి చూపి సమాధానపరచెను. అతడు బ్రహ్మాద్వైతమునే గాక దర్శనాద్వైతమునుకూడ,

అనగా అన్ని దర్శనములు చివర కొకటే యని తెలియ జేసెను. పరబ్రహ్మమును వేదమే "ఏకం సత్" (సత్పదార్థ మొక్కటే) అని నిర్వచించి, వెంటనే "విప్రాః బహుధా వదంతి" (తెలుసుకొన్నవారు వివిధవిధముల పేర్కొందురు) అని చెప్పుచున్నది.

ఇతర సిద్ధాంతములనుకూడ ఆదరించు శంకరుని సమరసభావ మతని సూత్రభాష్య ప్రథమ ప్రకరణములోనే కన్పించును. అద్వైతమునకు మూలసూత్రమగు అధ్యాసను గూర్చి వ్రాయుచు, అన్ని శాఖలవారి సిద్ధాంతములను పేర్కొని, అందరును ఒకవస్తువు మరొకదానివలె యగపడుటే యధ్యాస యని ఒప్పుకొనిరని చూపును. ఇది పాదరసము వెండివలెను, ఒకచంద్రు డిద్దరివలెను కనబడుటవంటిది. ఇతర శాఖలవారి భావములు పాక్షికములే కాని సత్యదూరములు కావు. భిన్నముగాను, బహుళముగాను కనబడువానిలో ఏకత్వ మతడు చూపును. వివిధశాఖలవారు ఒప్పుకొన్న భావములనే తీసుకొని అవి ఇంకా ఎట్లు పరిణామమునుపొంది పూర్ణత్వ మందగలవో శంకరుడు చూపెను.

పూర్వమీమాంసా వట్టి కర్మకాండకు ప్రాధాన్య మిచ్చును. బౌద్ధమతము నాస్తికముగా తయారయ్యెను. ఈ రెండును తుదకు నాస్తికత్వముకే దారితీయుచుండెను. శంకరు డీరెండింటిలోని లోపములుసరిదిద్దెను. కర్మకాండను జ్ఞానమార్గమునకు సహాయకారిగా నేర్పరచెను. బౌద్ధ ముఖ్య సిద్ధాంతమగు అహింసను హిందూమతములో ప్రవర్తనకు

ప్రధానముగా నొనర్చెను. దానితో బుద్ధుడు విష్ణుని అవతార ముగా పూజింపబడసాగెను.

వేదాంతము నేగాక మతమునుకూడ శంకరుడు సంస్కరించెను. వివిధమతములు భగవంతుని జేర్చు పరిశుద్ధమార్గములుగా నుండవలెనని యతని ఉద్దేశము. అనవసరముగా మతమున పెరిగిన ఆచారవ్యవహారముల తొలగింప బూనెను. దానికిని ప్రజలు విరోధులే. శంకరమత ప్రకారము సాకార బ్రహ్మభావమే సర్వోత్కృష్టము కాదు. కాని ఈశ్వరభక్తి అద్వైతసిద్ధికి సోపానమే. భగవంతునకు పెట్టిన నామరూపములు కావు ప్రధానము; గాఢమగు హృదయపూర్వక భక్తియే ప్రధానము. తన విష్ణుస్తోత్రములో శంకరుడు, ''సంసార తిమిర నాశకుడగు హరికి నమస్కారము. ఆ ఒక్క హరియే భేదభావముచే బ్రహ్మ, విష్ణు, రుద్ర, అగ్ని, సూర్య, చంద్ర, ఇంద్ర, వాయు, యజ్ఞ నామములచే వ్యవహరింపబడుచున్నాడు'' అని స్తుతించెను. మతముల సారమొక్కటే; నామములు వేరు. తన బోధనలలోను, ఆచరణలోను శంకరుడు శుద్ధ అఖండ ఆధ్యాత్మభావమే చూపియున్నాడు. భగవంతు ననేకరూపముల భేదబుద్ధి లేక స్తుతించియున్నాడు. షడ్దర్శనముల నతడు పరిశుద్ధములుగాను పరిపుష్టములుగాను జేసెను.

శంకరుడు హిందూమతమునకును వేదాంతమునకును చేసిన సేవను కేదారమునుండి కన్యాకుమారివరకు గల లెక్కలేని దేవాలయములు మతసంస్థలు వేనోళ్ల కొనియాడుచున్నవి. కైలాసమునుండి శంకరు డైదు లింగములు తెచ్చె

ననియు, వానిలో ముక్తిలింగమును కేదారములోను, వరలింగమును నేపాళమందలి నీలకంఠక్షేత్రములోను, మోక్షలింగమును చిదంబరములోను, భోగలింగమును శృంగేరీలోను, యోగలింగమును కాంచీపురమునను స్థాపించె నని ఒక గాథ కలదు. ఆదిత్య, అంబికా, విష్ణు, గణనాథ, మాహేశ్వరుల పంచాయతనపూజ శంకరు డేర్పరచినదే. వీనిలో భక్తుడు తన ఇష్టదైవమునకు ప్రధానపీఠ మిచ్చుకొన వచ్చును. శంకరుడు మఠము లేర్పరచి వానిని తనశిష్యుల కప్పగించెను. నేటికిని గొప్పస్వాము లా పీఠముల నలంకరించు చున్నారు. వీనిలో బదరికాశ్రమమందలి జ్యోతిర్మఠము, ద్వారకలోని కాళికాపీఠము, జగన్నాధపూరీలోని గోవర్థన పీఠము, శృంగేరీలోని శారదాపీఠము, కంచిలోని కామకోటి పీఠము గొప్పవి. తనపని ముగించుకొని, శంకరుడు ముప్పది రెండవయేట దేహము చాలించెను. కేదారములో ఒక గుహలో నత డదృశ్యుడయ్యెనని కొందరును, కంచిలోని సర్వజ్ఞపీఠ మధిష్ఠించి చివరి దినములు గడిపెనని కొందరును చెప్పుదురు.

నిస్సందేహముగా శంకరుడు వ్రాసినవే యనగల గ్రంథములే అసంఖ్యాకములుగా నున్నవి. అతనిభాష్యములు, ఉపదేశసాహస్రి, వివేకచూడామణి, శివానందలహరి, సౌందర్యలహరి వాఙ్మయమునకు శాశ్వతభూషణములు. అతని శైలి ప్రసన్నగంభీరము. అతని కుశాగ్రబుద్ధియు వాద నైపుణ్యమును అద్భుతములు. బ్రహ్మమునుగూర్చి అతడు వ్రాసిన తత్వము అర్థముచేసుకొనుటకు కష్టవిషయమైనను

అతిస్పష్టముగా దీనిని కరతలామలకముగా ప్రదర్శించును అతడు గద్యపద్యరూపమున రచించిన మహావాఙ్మయము భావగాంభీర్యము, భాషాసారళ్యము గల్గియున్నది.

తన వేదాంతసారమును శంకరుడే అర్ధశ్లోకములో నిమిడ్చి చెప్పెను: "బ్రహ్మసత్యం, జగన్మిథ్యా, జీవో బ్రహ్మైవ నాపరః" (బ్రహ్మ సత్యము, జగము మిథ్య, జీవుడు బ్రహ్మమే మరొకటికాదు.) "బ్రహ్మ", "ఆత్మ" అను ఉపనిషత్పదములు ద్వంద్వాతీతమగు ఉత్కృష్టసత్యమును సూచించును. పరమాత్మ ఇట్టిదని నిరూపించుట సాధ్యముకాదు కాన "ఇదికాదు, ఇదికాదు," (నేతి, నేతి,) అని మాత్ర ముపనిషత్తులు పలికినవి. దీనిభావము పరమాత్మశూన్యమనికాదు. అది పరిపూర్ణమైనదే. కొన్ని ఉపనిషత్తులు పరమాత్మ సత్యజ్ఞానానందస్వరూపమనికూడ వచించినవి. ఒకవస్తువును నిర్వచించుటనిన దానిని సంకుచితపరచుటే యగును. అనంతము అమేయమునగు వస్తువును సంకుచితభాషలో నిర్వచించుటెట్లు సాధ్యమగును. బ్రహ్మము నిర్గుణము. బ్రహ్మ పదార్థ మొక్కటే అని చెప్పుటకూడ సరియైన పద్ధతికాదు. ఉన్నదే ఒక్కటైనప్పుడు ఏకమనుటలో అర్థమేమి? అందుకే శంకరుడు తనసిద్ధాంతమును అద్వైతమనెను, అనగా రెండవది లేనిది అని అర్థము.

ఉపనిషత్తులలో బ్రహ్మము జగత్తుకు కారణమనియు, మంగళగుణనిధానమనియుకూడ చెప్పబడినమాట నిజమే! బ్రహ్మ మద్వితీయము, నిర్గుణమంటిమికదా! ఈ రెండు నెట్లు సమన్వయించుట? అందుకే శంకరుడు పారమార్థికము,

వ్యావహారికము అను దృష్టిభేదములద్వారా వీటిని సమన్వయము చేసినాడు. బ్రహ్మమే సత్యము. దాని కితర మేదియు లేదు. త్రాడునే పాముగా భ్రమపడినట్లు బ్రహ్మమునే జగత్తుగా భ్రమపడుచున్నాము. దీనినే వివర్తవాదమందురు.

ఈ లేని జగత్తు నున్నట్లు చూపునదే మాయ. మాయ కర్థము: "యా" యేదైతే, "మ" లేదో, అది మాయ. సత్యమును మరుగుపరిచి, అసత్యమునే భాసింపజేయునట్టి భగవంతుని అగమ్యమహాశక్తియే మాయ. ఈ మరుగుపరచుటనే "ఆవరణ" మందురు. ఈ భాసింపచేయుటనే "విక్షేప" మందురు. మాయ నిజమా, అబద్ధమా అను ప్రశ్నకు జవాబు అది నిజమునుకాదు, అబద్ధమును కాదు. బహురూపమగు ప్రపంచము కనిపించుచున్నది గాన అది అబద్ధముకాదు. అద్వైతజ్ఞానముచే తొలగిపోవుచున్నది కాన నిజమునుకాదు. అది అనిర్వచనీయము. మాయను గూర్చి చేయు విచారణ దాని నర్థము చేసుకొనుటకు కాదు, అతిక్రమించుటకే! అతిక్రమించినవాని కింక మాయ ఎక్కడిది?

మాయ నతిక్రమింప బూనిన దెవరు? జీవుడు. కాని నిజమునకు జీవుడు బ్రహ్మము నొక్కటే గదా! అజ్ఞానముచే (వ్యక్తికి సంబంధించినప్పుడు మాయను అజ్ఞానమందుము) జీవుడు, దేహము మనస్సులే తాననుకొని సంసారములో మునిగి పోవుచున్నాడు. మాయాకల్పితములగు దేహము, ప్రాణము, మనస్సు అను పొరలు ఆత్మను కప్పిపుచ్చి, తామే ఆత్మయనిపించుకొనుచు, తమ గుణములే ఆత్మ కాపా

దించుచున్నవి. చావుపుట్టుకలు లేని ఆత్మను దేహముతో పుట్టుచు చచ్చుచున్న దనుకొనుచున్నాము. కర్మ, కర్మ ఫలములు ఆత్మకే అంటగట్టుచున్నాము. జ్ఞానమువల్లనే యీమాయ తొలగగలదు.

మోక్షము ఆత్మయొక్క శాశ్వత సహజస్వభావము. మోక్షము వేరే సంపాదింప నక్కరలేదు. ఆత్మను మరుగు పరుచుచున్న మాయను జ్ఞానము తొలగించును. జ్ఞానమనగా వట్టి ధీ విశేషముకాదు. జ్ఞానమనగా ప్రత్యక్షాను భూతి. కర్మయోగ భక్తియోగములద్వారా జ్ఞానావరోధములు తొలగింపబడిన మీదట, ఆత్మవిచారము బాగుగా చేసినమీదట, రాత్రి గడచినమీదట సూర్యోదయమువలె, జ్ఞానముదయించును. ముక్తి కొఱకు మరణాంతమువరకు నాగ నక్కరలేదు. ఆత్మయొక్క నైజమే ముక్తి.

దేహము ధరించియున్నను జ్ఞాని ముక్తుడే. చనిపోయి నప్పుడతనిని విదేహముక్తుడందుము. అంతేకాని ముక్తిలో భేదములేదు. ముక్తికలిగినమీదట ఆత్మ పరమాత్మతో అభేదమును గ్రహించును. దీనినే అద్వైతానుభూతి యందురు. మనస్సులోని కోరికలన్నియు నశించినమీదట నరుడు బ్రహ్మము నిచటనే పొందునని ఉపనిషత్తులు చెప్పు చున్నవి.

అద్వైత సిద్ధాంతమును కట్టుదిట్టమొనర్చి, శంకరుడు నిరాశకుగాని, సందేహములకుగాని తావులేదని చూపెను. అద్వైతసత్యము నెవ్వడును కాదనలేడు. కాదన్నవాని ఆత్మ కూడ అద్వైతమే! ఉపదేశసాహస్రిలో శంకరుడు, ఆత్మ

అనునది పదార్థముకాదు. దానికి మార్పుకాని బహుత్వము కాని లేవు. దాని నదిగాని మరెవ్వరుకాని పరిగ్రహింపను లేదు, త్యజింపనులేదు. జననమరణములు లేక బాహ్యాభ్యంతరముల వ్యాపించియున్న ఆత్మ తానే యని గ్రహించిన వాని కింక భయమెక్కడిది? బహుత్వమున్నప్పుడే భయమునకు తావున్నది. అద్వైతము, అభయము అనునది ఒక్క అనుభూతికే రెండు పేర్లు. ఈ సత్యమును గ్రహింపుడని హెచ్చరించి, దానికి మార్గము కూడ చూపి లోక కళ్యాణ మొనరించెను. "సమస్త జ్ఞానాకరుడును, కృపావతారుడును జగత్కళ్యాణానంద సంధాయియునగు శంకర భగవత్పాదునకు నమస్కారము'' లన్న శ్లోక మతని మహిమను చాటుచున్నది.



# రామానుజాచార్యుడు

హిందూమతమున నన్ని సంప్రదాయములవారిలోను సిద్ధపురుషులున్నారు. శైవ వైష్ణవములు హిందూమతములోని ముఖ్యశాఖలు. వైష్ణవమతమునం దాళ్వారులకును ఆచార్యులకును కొంత భేదమున్నది. పండ్రెండుగు రాళ్వారులును సిద్ధపురుషులే. కాని ఆచార్యులు సిద్ధపురుషులేగాక వేదాంత ప్రబోధకులు కూడ. రామానుజాచార్యు డావర్గములోని వాడు. ఇంతకుముందు నాథముని, ఆళవందారు మొదలగు వైష్ణవగురువులుండినను, విశిష్టాద్వైతమును కట్టుదిట్టమొనర్చి ప్రచారముచేసినది రామానుజుడే యనక తప్పదు.

రామానుజుని జీవితమునుగూర్చి అతని కాలమునందే వ్రాసిన రెండు గ్రంథములున్నవి. నూటయెనిమిది పద్యములతో అముదనార్ తమిళమునవ్రాసిన నూర్రంతాది అనున దొకటి. నూట పదునాల్గు శ్లోకములతో వడుహానంబి యను ఆంధ్రశిష్యుడు గురువుగారినిగూర్చి యతిరాజవైభవమని వ్రాసిన దొకటి. ఇవి రెండును ప్రబంధ కావ్యములలో చేర్చబడినవి. ఇవిగాక వేదాంతదేశికుని యతిరాజ సప్తతియు, మనవాల మహామునియొక్క యతిరాజవింశతి యను గ్రంథములుకూడ ఉన్నవి.

మదరాసునుండి కంచిపోవు మార్గముననున్న శ్రీపెరుంబూదూరులో రామానుజుడు 1017-వ సంవత్సరమున

జన్మించెను. ఆసూరి కేశవసోమయాజి యితని తండ్రి. యామునాచార్యుని మనుమడగు శ్రీశైలపూర్ణుని చెల్లెలు కాంతిమతి ఇతని తల్లి. తాతగారి అనుమతితో శ్రీశైల పూర్ణుడు తిరుపతి కొండలపై వేంకటేశ్వరసేవ చేయుచుండెను. అతడే తన చెల్లెలిని ఆసూరి కేశవునకిచ్చి పెండ్లి చేసెను. పిదప చెల్లెలికి కుమారుడు కల్గినప్పు డతడే లక్ష్మణుడని (రామానుజుడు) పేరు పెట్టెను.

చిన్నతనముననే రామానుజుడు తండ్రిని కోలుపోయెను. గోవిందభట్టరు డను జ్ఞాతియు రామానుజుడును కలిసి చదువుకొనుచుండిరి. కొంత ఎదిగిన తరువాత కంచిలో ప్రసిద్ధ పండితులగు యాదవ ప్రకాశునివద్ద వేదాంతము చదువసాగిరి. రామానుజుని ప్రజ్ఞనుగూర్చి శ్రీరంగములో నున్న ముత్తాతయగు ఆళవందారు విని, మునిమనుమని చూడగోరి, మారువేషమున కంచికి నడిచివచ్చి, కళ్లార అతనినిచూచి, సంతుష్టుడయ్యెను. తన అనంతరము శ్రీరంగ పీఠమునకు రామానుజుడు తగినవాడని భావించెను.

యాదవప్రకాశు డద్వైతి. శాస్త్రముల కతడు చెప్పు వ్యాఖ్య రామానుజునకు నచ్చలేదు. ఆ ఊరుజమీందారు కుమార్తెకు దయ్యముపట్టెను. అది యాదవప్రకాశునకు లొంగక, రామానుజుడువచ్చి తన్నాజ్ఞాపించిన పోదునని తెల్పెను. అట్లే రామానుజుడుపోయి దానిని త్రోలివేసెను. దీనితో యాదవప్రకాశునకు రామానుజునిపై నసూయ జనించి రామానుజుని చంపించుటకుకూడ తంత్రముపన్నెనని చెప్పుదురు. కొందరు శిష్యులను కాశీయాత్రకు బయలుదేర

దీసి, కాశీగంగలో రామానుజుని పడ(ద్రో)సి చంపి, అతని మృత్యు వాకస్మిక సంభవమని చెప్పుడని గురువు శిష్యులకు నేర్పిపెట్టెను. దారిలో ఈ రహస్యమెరిగి గోవిందుడు రామానుజునితో చెప్పెను. అర్ధరాత్రమున నొంటరిగా రామానుజుడు తప్పించుకొని పోవుటకు బయలుదేరెను. దారిలో నొక వేటకాడును అతనిభార్యయు సాయపడిరి. కంచి సమీపించుచుండగా వేటకానిభార్య త్రాగుటకు నీరు కావలెననెను. సమీపముననున్న నూతికి రామానుజుడు నీరు తెచ్చుటకు వెళ్లివచ్చులోగా వారిద్ద రదృశ్యులైరి. వరదరాజస్వామి ఆలయశిఖరము లుషఃకాంతిలో కన్పట్టసాగెను. వారే లక్ష్మీ నారాయణులని రామానుజుడు గ్రహించి ప్రతిదినమా నూతి నుండి ఒక కడివెడు నీరు ఆలయపూజకై తీసుకొనివెళ్లి ఇచ్చుచుండువాడు.

తల్లి ఆజ్ఞ ప్రకారము రామానుజుడు గృహస్థుడై కంచిలో నుండెను. తిరుక్కచ్చినంబి అను సిద్ధపురుషుని అడుగు జాడలలో నతడును వరదరాజస్వామిసేవ చేయుచుండెను. శ్రీరంగముననున్న ఆళవందారునకు మరణకాల మాసన్నమయ్యెను. ఆయన అనంతరము రామానుజుడు శ్రీరంగపీఠాధిపతిగా ఉండు టాయన అభిమతమని యెఱిగి శిష్యులు తమలో పెద్దయగు పెరియనంబిని కంచికి రామానుజుని కొనితెచ్చుటకు పంపిరి. పెరియనంబి కంచివచ్చి వరదరాజస్వామి యెదుట నొక కీర్తన గానముచేయుటాల కించి రామానుజు డా కీర్తన వ్రాసిన దెవరని అడిగెను. ఆళవందారని తెలుసుకొని ఆయనను చూచుటకు పెరియ

నంబితో బయలుదేరెను. కాని వారు చేరుకొనులోపుననే ఆళవందారు మరణించెను. మృతదేహము కుడిచేతి మూడు వ్రేళ్లు ముడుచుకొని ఉండుటచూచి శిష్యులను రామానుజుడు కారణమడిగెను. మూడు తీరని కోరికలు గురువున కుండి పోయెననియు, అందు ముఖ్యమైనది బ్రహ్మసూత్రములకు బహు సులభమైన వ్యాఖ్యవ్రాయుటనియు వారు చెప్పిరి. ఆ కోరికలు తాను తీర్తునని రామానుజుడు చెప్పగా వ్రేళ్లు విప్పుకొనెను. రామానుజుడు తిరిగి కంచివచ్చి స్వామిసేవ చేయుచుండెను. తనభవిష్యత్తునుగూర్చి స్వామి ఉద్దేశ మేమో తెలియగోరి, రామానుజుడు ఆలయమునకుబోయి స్వామినడిగి తెలుసుకొమ్మని తిరుకచ్చినంబిని కోరెను.

జవాబాక శ్లోకరూపమున లభించెను. దానిలో "నేనే సర్వోత్కృష్టమంగళధాముడను. ద్వైతము నాకిష్టము. శరణాగతి మోక్షమునకు సూటియైనమార్గము వ్యక్తిప్రయత్న మవసరము లేదు. మోక్ష మంతమున లభించును. ఇప్పుడున్న గురువులలోకెల్ల పెరియనంబి ఉత్తముడు" అని దానిలో నుండెను. అందుచే పెరియనంబివద్ద వైష్ణవమతోపదేశము పొందుటకు రామానుజుడు శ్రీరంగమునకు బయలుదేరెను. కాని దారిలో మధురాంతకమువద్దనే అదేపనిమీద బయలు దేరిన పెరియనంబి యెదురయ్యెను. అచటనున్న రామాలయ ములో రామానుజునకు పెరియనంబి వైష్ణవమతరహస్యములు బోధించెను. పిదప ఇద్దరునుకొన్నాళ్లు కంచిలోకాలముగడపిరి.

రామానుజుని కుటుంబజీవిత మంత సుఖప్రదము కాక పోయెను. భార్య ఆధ్యాత్మికముగా అనుకూలవతి కాదు.

అప్పుడప్పు డతనితో దెబ్బలాడుచుండెడిది. ఒకసారి ఆమె పెరియనంబిభార్యతో తగవులాడుటవల్ల పెరియనంబి సకుటుంబముగా శ్రీరంగము వెళ్లిపోయెను. గురువు వెళ్లిపోయిన కారణము తెలుసుకొని రామానుజుడు భార్యప్రవర్తనకు చాల చింతించెను. ఇంతలో మామగారు కూతును పంపమని కోరుట తనకు మంచిదయ్యెను. భార్యను పుట్టింటికి పంపి రామానుజుడు సన్న్యాసమును స్వీకరించెను. అతని గాఢ వైరాగ్యమునుచూచి జను లాతనిని యతిరాజని పిలువ సాగిరి.

ఆళవందారు శిష్యులు తమ గురుపీఠ మధిష్ఠించుటకు రామానుజుని తోడితెచ్చుటకు ఆళవందారు కుమారుడగు తిరువరంగప్పెరుమాళ్ అరైయరును పంపిరి. అతనితో రామానుజుడు శ్రీరంగమునకు పోయెను. ఇదివరకే పెరియనంబివద్ద రామానుజుడు పంచసంస్కారము పొంది యుండెను. ఇప్పుడు ఆళవందారు శిష్యులలో మరొకరగు తిరుక్కొట్టియూర్ నంబివద్ద మంత్రోపదేశము పొందదలచెను. కొన్నాళ్లు రామానుజుని పట్టుదల, అర్హత పరీక్షించినమీదట నతడు మంత్రోపదేశముచేయుట కంగీకరించెను కాని రామానుజు డా మంత్రము తిరిగి అర్హులకేగాని ఇతరుల కివ్వ రాదను నియమముచేసెను. దాని కొప్పుకొని రామానుజుడు మంత్రము స్వీకరించెను. ఇక్కడే రామానుజుని జీవితములో కెల్ల ఉత్తేజనకరమగు సంఘటన యున్నది. తాను ఉపదేశము పొందిన మంత్రము మహాపవిత్రమని కనుగొని ఆనందము పట్టలేక అతడు జనులందరిని ప్రోగుచేసి వారందరి కా మంత్రము

చెప్పివేసెను. అట్లేలచేసితివని కోపముతో గురువు గద్దింపగా అందులకు తనకేమిశిక్ష యని రామానుజు డడిగెను. నరకమే యని గురువనగా, ఇన్నివేలమంది మంత్రమువల్ల ముక్తులగు చుండగా నేనొక్కడను నరకమునకు పోవుటకు వెరువనని రామానుజుడు చెప్పెను. దానికి గురువు మహానందము పొంది అతడు బోధించు వైష్ణవమతమునకు రామానుజదర్శన మని యతనిపేరే కలుగునని దీవించెను. రామానుజుడు తిరువరంగప్పెరుమాళ్ అరైయర్, తిరుమలై యాండాన్ ల వద్ద తిరువాయ్ మొజిని, తిరుమలై నంబివద్ద రామాయణ మును పఠించెను. అట్లు ఆళవందారుయొక్క ఐదుగురు శిష్యు లతనికి గురువులై అతడు నిర్వహింపవలసిన మహా కార్యమున కతనిని సిద్ధమొనర్చిరి.

రామానుజుని కీర్తి వ్యాపింపసాగెను. అనేకశిష్యు లతనివద్ద చేరిరి. వారిలో శ్రీవత్సాంకమిశ్రుడు ముఖ్యుడు. రామానుజుడు యజ్ఞమూర్తియను అద్వైతిని వాదములో నోడించి తనశిష్యునిగా చేసుకొనెను. రామేశ్వరమునుండి బదరివరకు యాత్రకై బయలుదేరెను. పశ్చిమతీరము వెంట యాత్ర ఆరంభించి తూర్పుతీరము వెంట తిరిగివచ్చెను. శ్రీనగరములో నతనికి బోధాయనుని బ్రహ్మసూత్రభాష్యము లభించెను. తనతోనున్న మిశ్రు డది ఒక్కసారి చదివి కంఠస్థము చేసెను. దాని ననుసరించి రామానుజుడు తన భాష్యము వ్రాసెను. దీనినే శ్రీభాష్యమందురు. ఆళవందారు కోరిక యిప్పటికి తీరెను. రామానుజునిభాష్యము సరస్వతియే ఆమోదించి అతనికి భాష్యకారుడను బిరుదు నిచ్చెనందురు.

శ్రీరంగమునకే రామానుజుడు తిరిగి రాగోరెను. కాని అచట చోళరాజగు మొదటి కుళోత్తుంగుడు వైష్ణవులను హింసించుచుండుటచే రామానుజుని రావద్దని అనేకులు ప్రార్థించిరి. అందుచే నతడు హొయసాలరాజ్యమునం దాశ్రయముపొందెను. అచటనున్న భిత్తిదేవుడను రాజు జైనుడు. అతని కూతురు భూతపీడచే బాధపడుచుండగా రామానుజు డా భూతమును తొలగించెను. రాజు కృతజ్ఞతతో వైష్ణవము స్వీకరించి విష్ణువర్ధనదేవు డను పేరు బడసెను. రామానుజు డనేక వాదములలో జైనుల నోడించి మేలుకోటలో తిరునారాయణపెరుమాళ్ ఆలయము కట్టించెను. ఇచటనే రామానుజుడు పండ్రెండు సంవత్సరము లుండెను.

కుళోత్తుంగు ననంతరము వచ్చిన రాజు వైష్ణవద్వేషి కాడు. అందుచే రామానుజుడు శ్రీరంగమునకు తిరిగివచ్చి ఆలయార్చనలు మొదలగువానికి చక్కని ఏర్పాటులు గావించెను. తనశిష్యులను వైష్ణవసంప్రదాయములో నిపుణుల నొనర్చెను. అనేక మఠములను దేవమందిరములను కట్టించెను. దక్షిణాదిని వైష్ణవాలయము లన్నింటిని దర్శించి వానిని పునరుద్ధరించెను. ఆలయములలో వేదములతోపాటు ప్రబంధములను పఠించు పద్ధతి నెలకొల్పెను. శిష్యు లాతని విగ్రహములు మూడు చేయించి, అతని అనుమతితో వానిని శ్రీరంగము, పెరుంబూదూర్, తిరునారాయణపురములలో ప్రతిష్ఠించిరి. తన అవసానకాలము సమీపించుచున్నదని గుర్తించి, తా నేర్పరిచిన వివిధ కేంద్రములలోను డెబ్బది

నలుగురు శిష్యులు పనిచేయునట్లు నియమించెను. ఇట్లు తన పని పూర్తి చేసి రామానుజుడు 1137 లో తన నూటయిరువదవయేట అస్తమించెను.

రామానుజునిది విశిష్టాద్వైతము. దీని కాధారము లొకప్రక్క ఉపనిషత్తులును, మరొకప్రక్క ఆళ్వారులు రచించిన నాలాయిర ప్రబంధము అనబడు కీర్తనలును. అందుచే దీని కుభయవేదాంతమనికూడ పేరు కలదు. భాగవత సంప్రదాయము విశిష్టాద్వైతమున కనుకూలమే. బోధాయను ననుసరించి తన శ్రీభాష్యము వ్రాసితినని రామానుజుడే చెప్పినాడు. శ్రీభాష్యమేగాక, భగవద్గీతాభాష్యము, వేదాంతదీపము, వేదాంతసారము, వేదాంతసంగ్రహము, గద్యత్రయ మను గ్రంథములు రామానుజుడు రచించెను.

విశిష్టాద్వైతములో తత్త్వత్రయ మనగా ఈశ్వరుడు, ఆత్మ (చిత్), ప్రకృతి (అచిత్), వీనిలో భగవంతుడొక్కడే స్వతంత్రుడు. తక్కిన రెండును అతనిపై ఆధారపడియుండును. ఆత్మకు శరీరమునకు గల సంబంధమువంటిది భగవంతునకు ఆత్మప్రకృతులకు గల సంబంధము. ఆత్మయు, ప్రకృతియు ప్రత్యేకములయ్యు భగవంతునినుండి విడదీయుటకు వీలులేనివి. దీనినే అపృథక్సిద్ధి యందురు. ఇదే వైష్ణవమత మూలసూత్రము. "ఆవు తెల్లగా నున్నది", "దేవదత్తుడు మనుష్యుడు" అను వాక్యములలో ప్రకారముకాని విశేషణము కాని చెప్పబడినది. వస్తువులకును ప్రకారవిశేషణములకును అవినాసంబంధము. అట్లే ఆత్మ ప్రపంచములతో అవినా

సంబంధము కలిగిన భగవంతు డద్వితీయుడే; అద్వైతుడే. అనుటలో బాధ లేదు.

ఉపనిషత్తులందలి సత్య శివ సుందరానందగుణములు కల బ్రహ్మమే విశిష్టాద్వైతమందలి విష్ణువు; నారాయణుడును. అన్ని ప్రాణుల కత డాధారము, అతడే నియంత. అతడే గమ్యము. "ఎవడు ప్రపంచములో అంతర్గతుడై యున్నాడో, ఎవనిని ప్రపంచ మెరుగదో, ఎవని దేహము ప్రపంచమో, ఎవడు ప్రపంచమును లోనుండి నడిపించునో, అతడే ఆత్మ, అనంతుడు, అధిపతి" అను బృహదారణ్యము లోని వాక్యము రామానుజు డాధారముగా తీసుకొనెను. ప్రపంచమునకు భగవంతు డేకాధారముగానున్నను, ప్రపంచ పరివర్తన ప్రభావ మతని నంటదు. అతనిలో మార్పు రాదు. అతనిలోనున్న ప్రపంచమే మారుచుండును. ప్రపంచమున కత డంతర్వర్తియై యున్నను, అతీతుడై కూడ ఉండును. అతడే రక్షకుడు. ధర్మప్రవర్తకుడు. పతితమైన ఆత్మల నుద్ధరించుట కత డప్పుడప్పు డవతరించును. పవిత్రక్షేత్రములం దారాధింపబడు విగ్రహముల రూపమునను అతడు దర్శన మిచ్చును.

జడమగు ప్రపంచము ఆత్మకు, తద్ద్వారా పరమాత్మకు నివాసస్థానము. ప్రకృతియొక్క సత్వరజస్తమోగుణములు మూడును సృష్టిసమయమున బహిర్గతమగును. ప్రళయసమయమున ప్రకృతిసూక్ష్మరూపమున నుండును కాని నశింపదు. పూర్తిగా నశించి శూన్యమైనచో శూన్యమునుండి తిరిగి యేమియు నుద్భవింపదు. కారణములో కార్య మంతర్గతమై

యుండును. సృష్టించుట అనగా పరిణామ మని అర్థము. అంతర్గతమైనదానిని బహిర్గతమొనర్చుటే సృష్టి. సృష్టి ప్రళయములనగా ప్రకృతియొక్క దృశ్యాదృశ్యావస్థలే కాని సృజనవినాశనములు కావు. కాలముకూడ అచిత్తే, ప్రకృతిలో భాగముగా నదియు బ్రహ్మమునందుండునదే. భౌతికజీవితము కొఱ కాత్మకు కావలసినవి ప్రపంచము సమకూర్చును. భగవంతునిచేరుటకుకూడ అది సహాయకారియగును.

ఆత్మ చైతన్యసారము, అది జ్ఞానస్వరూపము. ముక్తి కల్గినప్పు డది అతిపరిపూర్ణవికాసమునందును. కాని బంధస ములో దాని జ్ఞానము సంకుచితమగును. పూర్వకర్మాను గుణమగు దేహము నది ధరించును. ముక్తి కల్గువరకు ఒక జన్మనుండి మరొక జన్మకు పయనించుచుండును. ఆత్మ లసంఖ్యాకములు కాని అవి మూడు రకములుగా నుండును. (1) నిత్యజీవులు (ఎన్నడు బంధములేనివి), (2) ముక్తజీవులు (మోక్షము పడసినవి), (3) బద్ధజీవులు (సంసారకూపములో కొట్టుకొనునవి). ఈ మూడవరకపు జీవులు ముక్తి పడయు వరకు జన్మపరంపర పొందవలసినదే.

కర్మ, జ్ఞానము, భక్తిద్వారా మోక్షము సాధింప వలెను. నిష్కామకర్మ మనస్సును పవిత్రమొనర్చును. అప్పుడు జీవు డాత్మవిచారము చేయగల్గును. విచారణవల్ల తాను భగవంతునిపై యాధారపడియుంటినని తెలుసు కొనును; తెలుసుకొని, భగవంతుని ప్రేమించి ధ్యానింప నాగును. జ్ఞానములోవలెనే భక్తిలోను ధ్యానమున్నది. భక్తిలో ధ్యానము భగవంతునిపై ప్రేమపూర్వకావలంబన

రూపము ధరించును. భక్తి పరిపక్వమైనమీదట భగవత్సా క్షాత్కారము కల్గును. దేహపతనముతో పూర్ణముక్తి లభించును. విశిష్టాద్వైతప్రకారము జీవన్ముక్తి లేదు. భక్తి జ్ఞానములు కలిగినమీదటకూడ చివరివరకు కర్మ చేయుచుండ వలసినదే. వేదములలో విధింపబడిన కర్మకాండ నేగాక ప్రార్థనను పూజనుకూడ చివరవరకు చేయవలసినదే. కర్మ తనంతట ముక్తికి జేర్చలేదు. అది సహాయకారిమాత్రమే.

భక్తి మార్గమవలంబించుటకు కొన్ని అర్హతలు కావలసియున్నవి. భక్తికి బదులు విశిష్టాద్వైతము ప్రపత్తిని బోధించును. ప్రపత్తి అనగా భగవంతుడొక్కడే శరణ్యామని పూర్ణ ఆత్మార్పణము చేసుకొనుట. భాగవత సంప్రదాయము ప్రకారము ముక్తికిది సాటిలేనిమార్గము. ఎవ్వరైనను దీని నవలంబింపవచ్చును. "భగవంతు నిచ్ఛకనుకూలముగా సంచరించుట, ప్రతికూలముల వర్జించుట, అతడు రక్షించును నని విశ్వసించుట, అతని సాయమే కోరుట, వినయముతో ఆత్మార్పణము చేసుకొనుట ప్రపత్తివిధాన"మని చెప్పబడినది. దీనినే శరణాగతి అనికూడ అందురు. జ్ఞాన భక్తిమార్గము ప్రపత్తికి జేర్చుననిన దాని ఘనత నూహించుకొనవచ్చును. శరణాగతులను భగవంతుడు రక్షించును. దేహపతనానంతరమున వైకుంఠము చేరి శరణాగతులు నిరంతరము భగవద్దర్శనము పొందుదురు,

---

# శ్రీ రామకృష్ణ

పందొమ్మిదవ శతాబ్దములో మన దేశమున నాంగ్లవిద్యయు, దానితోపాటు ఆంగ్లభావములు, ఆచార వ్యవహారములు వ్యాపింపసాగెను. చదువుకొన్నవారందరు పాశ్చాత్యపద్ధతులు మెచ్చుకొనసాగిరి. సనాతనపద్ధతులు విడనాడినగాని దేశమునకు ముక్తి లేదని తలపోసిరి. ఆంగ్లేయులకన్న మిన్నగా ఆంగ్లమానసపుత్రులగు మనవారే మన పూర్వ సంస్కృతిని నిరసింపసాగిరి. విదేశశాస్త్రముల మిడిమిడి జ్ఞానముతో మన శాస్త్రములు పనికిమాలినవని యేవగించుకొన సాగిరి. ముఖ్యముగా తాంత్రికసాధనలను కామ దూషితములని, గారడీ విద్యలని భావించిరి. కొందరు తాంత్రికులీ సాధనలను దుష్ప్రయోజనములకు వినియోగించిన మాట నిజమే. ఆంగ్లాధికారులు, వారి హిందూపరివారమును మన దేశము తన సనాతనత్వము నెంత శీఘ్రముగా చంపుకొని విదేశ వేషముతో పునర్జన్మ మెత్తిన నంత మంచిదని నమ్ముచుండిరి.

మన దేశచరిత్రయందట్టి ఉపద్రవ పరిస్థితులలో శ్రీరామకృష్ణు డవతరించెను. పుట్టిన పల్లెటూరి వాతావరణములోనే యౌవనప్రాయమువరకు గడచెను. పాశ్చాత్య ప్రభావముసోకని హిందూ సంప్రదాయములలో నతడు పెరిగెను. విధివిలాసమువల్ల తనగ్రామమునుండి అతడు ఆంగ్ల ప్రభుత్వ రాజధానియగు కలకత్తాపట్టణము చేరుకొనెను.

విజ్ఞానప్రధానమైన ఆధునిక ప్రపంచమున కతడు పూర్వ ఋషులు బోధించిన పారమార్థిక జీవితములో పొరపాటులేదని ఋజువుచేసెను. కాలక్రమమున చెడుదారిపట్టిన కొన్ని సాధనలనతడు సంస్కరించి పునరుద్ధరించి, ఆ సాధన లెంత పటిష్ఠములో చూపెను. సత్యమొక్కటే, కాని ఋషులనేక నామములతో దానినే పిలుతురన్నది, తన మహోజ్వల జీవితముద్వారా స్పష్టపరచి మతముల పరస్పర వైరములు నిష్ప్రయోజనములని వెల్లడించెను.

కామార్పకూర్ అను నొక బంగాలీ గ్రామములో ధర్మమునకు పవిత్రతకు పేరుపడ్డ ఒక బ్రాహ్మణకుటుంబములో శ్రీరామకృష్ణుడు 18 ఫిబ్రవరి 1836-వ సంవత్సరమున జన్మించెను. తండ్రి క్షుధీరాం ఛటోపాధ్యాయుడు. స్వగ్రామమగు దరియాపూర్ లోని జమీందారు నడుపు చున్న వ్యాజ్యములో దొంగసాక్ష్యమిచ్చుట కొప్పుకొనక కామార్పకూర్ విడిచి వచ్చెను. తల్లి చంద్రాదేవి దయా భక్తులుగల నిష్కల్మషురాలు. తమ గృహదేవతల పూజలోనే వారు విశేషకాలము గడపుచుండిరి. ఈ ఆదర్శదంపతులకు రామకృష్ణుడు జన్మించెను. అతని పుట్టుకనుగూర్చి వారిద్దరు అనేక దివ్యదర్శనములు గాంచిరి. క్షుదీరాంకు గయలో, అచటి దేవుడగు గదాధరుడు కలలో నగుపించి, "నిన్ననుగ్రహించితిని నీకు బిడ్డడనై పుట్టుదు" నని సెలవిచ్చెను. అదేసమయమున కామార్పకూర్ లోని శివాలయమున శివలింగమునుండి వెలువడిన తేజస్సు, గర్భగుడిని అందున్న చంద్రాదేవిని చుట్టుముట్టెను. దానితో స్పృహతప్పి

ఆమె పడిపోయెను. దీని వెనుకనే ఆమెగర్భవతి యయ్యెను. పుట్టినబిడ్డకు గదాధరుడని వారు నామకరణముసేసిరి.

అతని బాల్యము సుఖముగాగడచెను. గ్రామస్థులందరికి ముద్దుగా నతడు పెరిగెను. తోడిపిల్లలకు నాయకుడుగా నుండెను. బయట కులాసాగా తిరుగుచున్నను, అతడు తరుచు ఏకాంతమునకుబోయి ధ్యానములో కాలముగడుపువాడు. ఆరవయేట మొదటిసారిగా అతడు సమాధిలో పడిపోయెను. ఒడిలో నింపుకొన్న బొరుగులు తినుచు, పొలముగట్లమీద నడుచు నపుడు తలయెత్తి చూచుసరికి, పెద్ద పెద్ద నల్లని మేఘములు ఆకాశమంతయు క్రమ్మియుండెను. తెల్లని కొంగలబారు నల్లనిమేఘమున కంచుగట్టి పోవుచుండెను. ఆ మనోహరదృశ్యమున కతని మనస్సు ఆనందములో తేలిపోయి అతడు స్మృతితప్పి పడిపోయెను. నాటినుండి అట్టి భావావేశస్థితి అప్పుడప్పుడతనికి కలుగుచుండెను. ఆధ్యాత్మిక దృష్టిగల తల్లిదండ్రు లతని స్థితి నర్థముచేసుకొనగల్గిరి. అతని యేడవయేట తండ్రి మరణించెను. దానితో అతని పారమార్థికాసక్తి మరింత గాఢమయ్యెను.

కామార్పుకుర్ పూరీకి పోవుదారిలో నుండుటచే సన్న్యాసులు తరుచు అచట మకాము చేయుచుండిరి. వారితో కాలము గడుపుట గదాధరున కిష్టము. వారి మాటలు మననముచేయుచుండుటచే అతనికి కాలము వృధాబుచ్చరాదను భావము కల్గెను. బడిచదువుమీద బుద్ధి మళ్లుటలేదు; అది ధనసంపాదనకుమాత్రమేకదా! గ్రంథములనుండిగాక ప్రకృతినుండియే యతడు జ్ఞానము గ్రహింప

సాగెను. సాధుసన్న్యాసుల బోధ లాలకించుచుండెను. తొమ్మిదవయేట ఉపనయనమైనప్పటినుండియు నతనికి ఇల వేలుపగు రఘువీరుని పూజసేయుట కర్తవ్యతగాగ్గెను. ఆ రఘువీర విగ్రహ మతనికి సజీవముగా తోచుచుండెను.

ఇంటిబాధ్యత పెద్దన్నయగు రామకుమార్‌పై బడెను. 1849లో అతడు కలకత్తాలో ఒక సంస్కృత పాఠశాల నెలకొల్పెను. కొందరిండ్లలో దేవతార్చనకుకూడ ఒప్పుకొనుటచే, తనకు సాయముగా నుండునని పదహారేండ్లవయస్సు గల తమ్ముని గదాధరునికూడ కలకత్తా పిలిపించుకొనెను. ఆ పిదప కలకత్తాకు సమీపమున దక్షిణేశ్వరములో రాణీ రాసమణి కట్టిన కాళీదేవాలయములో రామకుమార్ పూజారిగా కుదిరెను. గదాధరుడుకూడ వెళ్లి అర్చనలలో అన్నకు సాయపడుచుండెను. దక్షిణేశ్వరమున అర్చకుడుగా జేరిన ఒక్కసంవత్సరములో రామకుమారుడు చనిపోయెను. గదాధరుని ఆధ్యాత్మికజీవితమునకు ముగ్ధులైన రాణి రాసమణియు, ఆమె అల్లుడు మధురబాబును, ఉన్నతస్థాన మతని నలంకరింపుమని కోరిరి.

దక్షిణేశ్వరాలయమునకు వెనుకతట్టుననున్న చిట్టడవులలోనే రామకృష్ణుని సాధనలు గడచెను. అతడచట తన చేతులతో నాటిన పంచవటి ఇప్పటికి నున్నది. ఇరువదేండ్ల యౌవనములోనున్న రామకృష్ణుడు శాస్త్రోక్తముగా ప్రశాంతముగా అర్చనలు సాగించుచుండగా హఠాత్తుగా తుపానువలె భక్తి అతనిలోరేగి మనుష్యుల కందని ఎత్తున కెత్తివేసెను. కాళీవిగ్రహమతనికి శిలాప్రతిమ కాదు. ఆమె

చైతన్యమయి. పూజలో కూర్చుండగానే బాహ్యప్రపంచ మతనికి మరుగుపడెడిది. పూజ చూచుటకు వచ్చినవారి యునికియే అతనికి తెలియదు. ఒక్కొక్కసారి గంటల తరబడి నిశ్చలముగా పూజలో కూర్చుండిపోవును. హృదయు డను మేనల్లుడు ఎలుగెత్తి పిలిచినను స్పృహ వచ్చెడిది కాదు. మంత్రము లుచ్చరించినంతనే రామకృష్ణునకు వాని వాని శక్తు లగపడుచుండెడివి. సాధారణ అర్చకు లవి ఊహించుకొందురేకాని దర్శింపలేరు. మామూలు అర్చకు లకు పూజావిధానము బాగుగా వచ్చిఉండును కాని వారికి పూజాగమ్యము లభ్యముకాదు. పూజాతతంగముతో రామ కృష్ణునకు పనిలేదు. హృదయ నివేదనమే అతని విధానము. కాళీమాతను ప్రత్యక్షముగా దర్శింపవలెనను తహతహ అతనిలో జనించెను. తన ఆరాటమునుగూర్చియు, తనకు గల్గిన ప్రథమ దర్శనముగూర్చియు శిష్యులకాయన యిట్లు చెప్పెను.

"తల్లిదర్శనము కానందుకు భరింపరాని వేదన పడు చుంటిని. నా హృదయము నెవ్వరో తడిగుడ్డవలె పిండు చున్నట్లు గిలగిలలాడితిని. తల్లి కనపడదేమోయను నిరాశ నన్ను కాల్చివేయుచుండెను. 'ఛీ, ఎందుకీబ్రతుకు' అను కొంటిని. గుడిలో కాళీవిగ్రహము ప్రక్క గోడమీదనున్న కత్తిపై నాదృష్టి పడెను. తత్‌క్షణము దానితో పొడుచు కొనుటకు పిచ్చివానివలె ఒక్కపరుగునపోతిని. దానిని తీసికొనునంతలో హఠాత్తుగా తల్లియొక్క అద్భుతమైన దివ్యదర్శనము నాకు కల్గినది. స్మృతితప్పి పడిపోతిని.

బాహ్యజ్ఞానము లేదు. ఆనాడు, మరునాడు ఎట్లుగడచెనో నాకు తెలియదు. నాహృదయములో మాత్ర మెన్న డెరుగని మహానంద ప్రవాహము పొర్లి పొరలుచుండెను. మహా జ్యోతిర్మయియగు తల్లినిగూర్చిన ప్రత్యక్షజ్ఞాన మంతటితో నాకు లభించెను.''

నాటినుండి సజీవమైన తల్లినేగాని విగ్రహమునుకాదు రామకృష్ణుడు పూజించినది. ''నిజముగా ఊపిరి పీల్చుకొను చున్నదా లేదా అని నా అరచేయి నామె ముక్కువద్ద ఉంచి ఉచ్ఛ్వాసనిశ్వాసము లాడుచున్నట్లు తెలుసుకొంటిని. ఎంతో దీక్షతో పరిశీలించితినికాని ఆమెనీడ దీపపుకాంతిలో గోడ మీద యెన్నడు పడలేదు. చిన్నపిల్లవలె సరదాగా ఆమె తన కాళ్ల గజ్జెలధ్వని చేసుకొనుచు మేడమెట్లెక్కుట నేను నాగదినుండి చూచితిని. నేనుచూచినది నిజమా భ్రమా అని మరల బయటకువచ్చి తేరి పారచూచితిని. తలవెంట్రు కలు విరబోసుకొని దేవాలయము డాబాపైనుండి తల్లి కలకత్తావైపు కొంతసేపు, గంగవైపు కొంతసేపు చూచు చుండెను.''

భక్తి మైకములో మునిగిపోయిన రామకృష్ణుని అచ్చె రువుతో తిలకించుచు ప్రజలతనిని పిచ్చివాడనుకొనిరి. తమ పల్లెటూరులో ఈవార్తవిన్న రామకృష్ణుని తల్లి భయభీతయై కొడుకును తనవద్దకు పిలిపించుకొనెను. బంధుమిత్రుల సలహా ననుసరించి ఆమె రామకృష్ణునకు పెండ్లిచేయ నిశ్చయించెను. చిత్రమేమనగా రామకృష్ణుడు పెళ్లి కడ్డుచెప్పలేదు సరి కదా తనకు భార్యకాబోవుపిల్లయొక్క ఊరు, కుటుంబముకూడ

తెలియజెప్పెను. పెళ్లినాటి కతని వయస్సు ఇరువదిమూడు, శారద కారేండ్లు. కొన్నేండ్లపిదప ఆమె దక్షిణేశ్వరము చేరుకొనిన మీదట, రామకృష్ణుని సేవ లభించుట, ఆయనకు ప్రథమశిష్యురాలు కాగల్గుట, అతని దివ్యానందములో పాల్గొనుట ఎంతటి భాగ్యమో ఆమె గ్రహించగల్గెను.

రామకృష్ణుని పరమార్థపరిశోధనల కతని పరిణయ మడ్డంకికాలేదు. దక్షిణేశ్వరము తిరిగి వచ్చినమీదట అతని సాధనలు మరింత గాఢమయ్యెను. హిందూమతమున వివిధ సంప్రదాయములలో చెప్పబడిన బహు సాధనలత డొనరించెను. అన్ని రకముల సాధనలు చేసినగాని అతని పరమార్థ కాంక్ష తీరలేదు. ప్రసిద్ధశాస్త్రములలో చెప్పబడిన భక్తి భావములన్నింటి నతడు పొందిచూచెను. దివ్యానందము గ్రోలినకొలదిని అతని కందలి పిపాస హెచ్చెను.

పారమార్థిక సాధనలలోకెల్ల తాంత్రికసాధనలత్యంత కఠినములు, అపాయకరములు. అందలి వ్యామోహములకు సాధకులు లొంగిపోదురు. ఇంద్రియములు బలీయములుకదా! నీచ పదార్థములందును పరమాత్మ సౌందర్యమును గమనించునది తాంత్రికమార్గము. అపవిత్రుడీ మార్గమవలంబించి భ్రష్టుడై శుద్ధ సౌందర్య దర్శనము చేయజాలడు. మహా పవిత్రుడగు రామకృష్ణు డేదోసగు లేకుండ తాంత్రిక సాధనలు ముగించెను. ఈ సాధనలలో ఆరితేరిన భైరవీ బ్రాహ్మణి అను సన్న్యాసిని రామకృష్ణునకు మార్గదర్శిని యయ్యెను. ఈ సాధనలలో రామకృష్ణునిది వీరవిజయము. అతని వైరాగ్యము మరింత బలిష్ఠమయ్యెను. ఈసాధనలవల్ల

లభించిన సిద్ధులతడు హేయముగా చూచెను. తన శరీరమున కబ్బిన బంగారువన్నెనుకూడ ఏవగించుకొనెను. "తల్లీ, ఈ బాహ్య సౌందర్యములు తొలగింపుము. నాకు ఆంతర సౌందర్యము, పవిత్రతను ప్రసాదింపుము," అని పలవించినాడు. బాహ్యసౌందర్యము, పారమార్థిక ప్రకాశమువలె కన్పట్టుచున్నను, హానికరమే. బాహ్యాడంబరములనుండి తప్పించుకొని తాంత్రికసాధనలలో విజయముపొందవచ్చునని రామకృష్ణుడు సాధకలోకమునకు ప్రదర్శనపూర్వకముగా చాటి చెప్పెను.

తాంత్రికసాధనలు వైష్ణవసాధనలు కలిసి బహుముఖ సగుణబ్రహ్మానుభవముల నివ్వగలవు. వివిధమార్గముల ననుసరించుచు రామకృష్ణుడు మరల మరల భగవంతుని చేరుకొనుచుండెను. తాను కౌసల్యననుకొని రామలాలును బిడ్డవలె ప్రేమించెను. హనుమంతుని దాస్యభావమవలంబించి రామచంద్రుని సేవకుడయ్యెను. బృందావన గోపికయై, విశ్వమనోహరుడగు శ్రీకృష్ణుని సంయోగముపొందెను. ఇట్లనేకవిధముల రామకృష్ణుడు భగవంతుని మహామహిమ చూరగొనెను.

మరొక్క మెట్టుమాత్రముండిపోయెను. అదికూడ రామకృష్ణు డెక్కుటకు తల్లి అన్నిఏర్పాటులు చేసెను. అదియే నిర్గుణ బ్రహ్మానుభవము. కఠిన సాధనలద్వారా నిర్వికల్ప సమాధిలో ఆరితేరిన తోతాపురి రామకృష్ణునకు గురువయ్యెను. రామకృష్ణుడు నామరూపము లను తెరను చీల్చివేయగల్గెను. అఖండ ఆధ్యాత్మజ్యోతిలో అతని వ్యక్తి

త్వము విలీనమైపోయెను. ఆ అద్వైతానుభూతిలో కార్య కారణ భేదముండదు. ద్వైతభాషలో చెప్పుకొన్నప్పుడే అత డట్టి అనుభవము పొందెననియు, మూడుదినములందట్లే ఉండెననియు, పిదప ప్రపంచజ్ఞానము కలిగెననియు చెప్పుదురు. కాని నిజమున కాస్థితిలో సాధకుడనిగాని సాధ్యమనిగాని భేదములేదు. అది అవాఙ్మానస గోచరస్థితి. మన దృష్టిలోనే జీవన్ముక్తుడు దేహధారిగానుండుట ; నిజమునకు భగవంతునిలోనున్న జీవన్ముక్తుడు మనదృష్టికి దేహమందున్నట్లు గోచరించును. ఇదే మాయ. మాయ ధర్మమాయని ముక్త ముముక్షుసంబంధము సాధ్యమగుచున్నది.

నిర్గుణ పరబ్రహ్మానుభవమునుండి దిగివచ్చిన మీదట, రామకృష్ణుడు ఇస్లామ్ క్రైస్తవమతములుకూడ అభ్యసించెను. అన్ని మతము లాపరమాత్మను జేర్చు మార్గములే అని అతడు తన అద్వైతసిద్ధివల్ల కనుగొనెను, కాని తర్కముద్వారా కాదు. ఇస్లామ్ క్రైస్తవమతములలో చెప్పబడ్డ సాధనల నాచరించి అవికూడ బ్రహ్మసాక్షాత్కారము కల్గించుట చూచెను. అన్ని మతములలో నొకేసత్య మిమిడి ఉన్న దన్న సంగతికి అతని అనుభవములే ప్రబల సాక్ష్యము. ''హిందూ, ఇస్లామ్, క్రైస్తవమతముల నేనభ్యసించితిని. హిందూ మతములోని భిన్న భిన్న సంప్రదాయములుకూడ అనుసరించితిని. వివిధమార్గముల గుండా అందరును ఒకే భగవంతునివైపు పయనించుచున్నారని కనుగొంటిని. మీరును ఒక్కసారి అన్ని మతములు పరిశీలించుట మంచిది. కాని, మతముపేరిట ఎటుచూచినను జనులు పోరాడు

చున్నారు. కృష్ణుడు, శివుడు, మూలశక్తి, జీసస్, అల్లా, అన్నియు నొక్కటే. వేలకొలది పేర్లతోనున్న వదే రాముడు. చెరువున కెన్నో రేవులుండును. హిందువులు కుండలలో నీరు నింపుకొని దానిని "జల" మందురు; మహమ్మదీయులు తోలుసంచులతో నింపుకొని "పానీ" అందురు; ఇంకొకచోట క్రైస్తవులు "వాటర్" అందురు. ఎంత చిత్రము! వివిధనామములు గల పదార్థ మొక్కటే. అందరు ఆపదార్థమునే కోరుచున్నారు. శీతోష్ణస్థితులు, నామములు, తత్వములు మారవచ్చును. హృదయపూర్వకముగా భగవంతుని కాంక్షించుచు, ఎవరిమతము వారనుసరించిన యెడల అందరును భగవంతుని చేరగల్గుదురు" అని రామకృష్ణుడు తెల్పెను.

అద్వైతానుభవముతో రామకృష్ణుని జీవితము పరిపూర్ణమయ్యెను. అతనిలో ద్వైతభావము లేదు కనుక అతని శాంతికి భంగము లేదు. అతడు పూర్తిగా వికసించిన పుష్పము. తేనె త్రాగుటకు తుమ్మెదలు మూగెను. ఇదియు అతడు చెప్పిన ఉపమానమే. చివరిదినములలో తనవద్దకు వచ్చినవారి కతడు తన అనుభవముల వివరించి చెప్పువాడు. ముఖ్యముగా ఒక యువకశిష్యబృందమును తయారుచేసెను. వారికి వివేకానందుడు నాయకుడు. వీరు రామకృష్ణమిషన్ స్థాపించి ప్రపంచమున దశదిశల తమగురువుయొక్క సర్వమతసమత్వసందేశము వ్యాపింపజేసిరి. బ్రహ్మామతమహానాయకుడగు కేశవచంద్రసేన్, అతని కుడిభుజ మనదగు ప్రతాపచంద్రముజుందార్ రామకృష్ణుని గాఢముగా ప్రేమిం

చిరి. ప్రధానోపాధ్యాయుడగు మహేంద్రనాథ్‌గుప్త చాల మంది యువకులను పరమహంస ఆశ్రయములోనికి తీసుకు వచ్చెను. దుర్గాచరణ్ నాగ్ గృహస్థశిష్యులలోకెల్ల ఆదర్శ ప్రాయుడు. మహాకవి గిరీశ్‌చంద్రఘోష్ రామకృష్ణభక్తు లలో నొకడు.

ఎందరో యువకులు రామకృష్ణు నాకర్షణపొంది అతని కంకితమై పోయిరి. తరువాత వీరే స్వామి వివేకానందుని నాయకత్వమున రామకృష్ణసంఘముగా నేర్పడి తమ గురు సందేశము నెరవేర్చిరి. ఈ మహాకార్యముకొఱకే వీరిని రామకృష్ణుడు తన చివరిదినములలో తయారుచేసినది. రామకృష్ణుని ఖ్యాతి వ్యాపించుటచే ప్రజ లవిచ్ఛిన్నముగా రా దొడంగిరి. వారిపై అవ్యాజప్రేమతో, తన అనారోగ్య మునుకూడ పాటింపక, రామకృష్ణుడు వారికి బోధించి, వారి కష్టములలో సానుభూతి చూపుచుండెను. మొదట ఆయన కంఠము వాచెను. పిదప అది కొఱకుడుపుండని తెలియ వచ్చెను. పవిత్రమాత శారదాదేవి భక్తిశ్రద్ధలతో భర్త సేవచేసెను. నిరంతరము నరేంద్రుడు (వివేకానంద) ఇతర యువశిష్యులు గురుసేవచేయుచుండిరి. 1886–వ సంవత్సరము ఆగస్టు నెల 15–వ తేదీని రామకృష్ణుడు తుదిసారిగా శిష్యులకు బోధసలిపి కాళీనామ ముచ్చరించుచు మహాసమాధినందెను.

మహాత్మాగాంధి రామకృష్ణునిజీవితము. "ఆచరణలో ఉన్న మతముయొక్క కథ" అని వర్ణించెను. దానిని రొమెయిన్ రోలాండ్ "ముప్పదికోట్ల ప్రజల, రెండువేల సంవత్సరముల పరమార్థజీవితఫల"మని పలికినాడు. "బ్రహ్మ

మొక్కటే'' అను వేదాంతరహస్యమును మరల మనకు దక్షిణేశ్వర పరమహంస వినిపించుటేగాక మానవసేవద్వారా ఆ సత్యమును కనుగొను మార్గముకూడ చూపినాడు. సాధన సంపత్తి లేకుండ ఒక్కగెంతులో పూర్ణజ్ఞానమును పొందలేము. గమ్యముచేర్చుటకు నిష్కామకర్మ తగిన సాధనము. తోడిమానవుల కష్టనిష్ఠురములకు గుండె కరుగనివాడు పారమార్థికముగా ఒక్కఅంగుళమైనను పురోగమింపలేడు. సత్యాన్వేషి సాక్షాత్కరించుకొనగోరు ఆత్మ అనగా వ్యక్తిగత స్వార్థము కాదు. సమస్త ప్రాణులలోను ఏకమై అవిచ్ఛిన్నముగా ప్రకాశించు ఆత్మయొక్క సాక్షాత్కారమే సత్యాన్వేషి కోరును. స్వార్థపరత పరమార్థమునకు శత్రువు. స్వార్థరహిత సేవచే గాక స్వార్థ మెట్లు లొంగును? సాధారణముగా మెప్పుకొరకు సేవచేయుదురు. దీనివల్ల ఇరుపక్షములకును నష్టమే గాని, లాభముండదు. పతితులలోను, బాధితులలోనునున్న భగవంతుని సేవింపవలెను. తనగురువునుండి నేర్చిన యీ సిద్ధాంతమును వివేకానందు డిట్లు ప్రకటించెను: ''సర్వజీవసమష్టి ఆత్మయే నేవిశ్వసించు దైవము. అన్ని జాతులయందు గల పాపులలోను, దుఃఖితులలోను, దరిద్రులలోను ఉన్న భగవంతునే నేను ప్రధానముగా నమ్ముచున్నాను.''

భగవంతుని విరాడ్రూపములో ఐక్యభావమందిన రామకృష్ణు డిట్లు పలుకుచున్నాడు : ''ఒక్కజీవికి సాయపడుటకు తిరిగి తిరిగి కుక్కగానైన పుట్టుట నాకిష్టమే. ఒక్కనికి సాయపడుటకు ఇరువది వేల జన్మలైన ఎత్తుదును. ఒక్కనికి సాయపడినను అది మహాకార్యమే''. ఈ భావము ఉపని

షత్తులు మొదలగు పవిత్ర గ్రంథములలోని బోధనల కనుకూల
ముగా నున్నది. శాస్త్రార్థములు జీవితమున ఆచరణలో పెట్ట
వలెననుకొన్నచో రామకృష్ణునివంటి మహాత్ముల జీవితములు
గమనించుట అవసరము. ''రామకృష్ణుడు ఉపనిషత్తులకు
సజీవవ్యాఖ్య. మానవాకృతిగల ఉపనిషత్సారము. హిందూ
దేశమందలి వివిధసంప్రదాయభావముల సంపుటీకరణ''మని
వివేకానందుని అభివర్ణనము.

# రమణమహర్షి

పక్షి యెగిరిన మార్గమును గాలిలో గీసి చూపుట యెంతో కష్టమో సిద్ధపురుషుని మార్గము తెలుపుటకూడా అంత కష్టమేనని శాస్త్రములు చెప్పుచున్నవి. సాధారణులందరు గమ్యమునకు కష్టమువిూద నెమ్మదిగా బోవలసి ఉండును. కాని ఒక్క ఎగురులో కొందరు సర్వజీవాశ్రయుడగు పరమాత్మను చేరుకొందురు. అట్టి సిద్ధపురుషుని చూచినప్పుడు సాధారణులకు ధైర్యము, ఉత్సాహము కల్గును. అతనివలె ఎగరలేకపోయినను, సామాన్యు లతని సన్నిధిని ఉన్న తాను భూతి నొందుదురు. ప్రపంచసుఖముల తృణీకరించు దివ్యానందరుచి వారికినట్లు తోచును. తిరువణ్ణామలైలో రమణమహర్షిని సందర్శించిన అసంఖ్యాకజనమునకీ అనుభవమున్నది. వెళ్లినవా రాయనలోని గొప్ప గొప్ప గుణములు గ్రహించుచుండిరి. ఆయనకు బొత్తిగా ప్రాపంచికవాసన లేదు. ఆయన అసమానపవిత్రుడు. వేదాంతతత్వనిత్యదర్శి. రమణమహర్షియంతటి గొప్పసిద్ధులు అరుదుగా జన్మింతురు. అటువంటివారు పుట్టినపుడు విశ్వమానవలోకమునకే లాభము. వారితో నొక ఆశాయుగ మారంభమగును.

మధురకు ముప్పదిమైళ్లదూరములోనున్న తిరుచ్చులిలోని శివాలయమునుగూర్చి సుందరమూర్తి, మాణిక్యవాచకర్లు గానముసేసియున్నారు. 19–వ శతాబ్దము చివరికాలమున

నీ గ్రామమున సుందరయ్యరు అను పట్టాలేని ప్లీడరుండెను. ఆయనభార్య అలఘమ్మాళ్. వారు పవిత్రత భక్తిగలవారు. దానధర్మములుసేయు బుద్ధికలవారు. ఉన్న దానికన్న హెచ్చుగా దానముచేయు స్వభావము సుందరయ్యరిది. అలఘమ్మాళ్ ఆదర్శ హిందూవనిత. 1879-వ సంవత్సరము డిశంబరునెల 30-వ తేదీన వీరికి రమణమహర్షి అని ప్రపంచ ప్రఖ్యాతిపొందిన వేంకటరమణ జన్మించెను. అది పవిత్ర ఆర్ద్రిదర్శనదినము. ప్రతిసంవత్సరము ఈ దినమున నటరాజ స్వామి ఊరేగింపు జరుగును. గౌతమ, పతంజలి, వ్యాఘ్రి పాద, మాణిక్యవాచకరులకు దర్శనమిచ్చిన కరుణాళుడగు నటరాజస్వామి ఉత్సవమది. గ్రామమంతయు ఊరేగిన పిదప స్వామి తిరిగి దేవాలయములో ప్రవేశించు సమయమున వేంకటరమణ జన్మించెను. ఇతని చిన్నతనముగూర్చి చెప్ప పలసిన విశేషములు లేవు. సాధారణబాలునివలెనే పెరిగెను. తిరుచ్చులి ప్రాథమికపాఠశాలలోను, ఒక్కసంవత్సరము దిండిగల్ పాఠశాలలోను చదువుకొనెను. అతని పండ్రెండవ యేట అతని తండ్రి చనిపోయెను. దానితో నా కుటుంబము తిరుచ్చులినుండి మధురలోనున్న అతని పినతండ్రి సుబ్బయ్యరు వద్దకు తరలిపోయెను. మధురలోనున్న స్కాట్సు మిడిలు స్కూలులోను, అమెరికన్ మిషన్ హైస్కూలులోను వేంకటరమణ చదువుకొనెను. చదువులో వెనుకబడినను మంచి బలము, ఆరోగ్యము కలగియుండెడువాడు. అతని బలముచూచి తోడిబాలురు భయపడుచుండిరి. ఎవరికైనను అతనిమీద కోపమున్నయెడల నిద్రపోవుచున్నప్పుడే అతని

నేమైన చేయగలైడువారు. నిద్రలో ఏమిజరిగినది తెలియు నంత గాఢనిద్ర అతనికి పట్టెడిది. నిద్రలో అతనిని మోసుకు పోయినను, కొట్టిననుకూడ అతనికి తెలిసెడిదికాదు.

ఒకనాడు వారింటికివచ్చిన ముదుసలి బంధువు అరుణాచలమునుండి వచ్చెనని వేంకటరమణ ఆయన నడిగి తెలుసుకొనెను. అరుణాచలనామము వేంకటరమణపై గారడీవలె పనిచేసెను. ఆవేశముతో, "అరుణాచలమునుండా? అదెక్కడ నున్నది?" అని అడిగి తిరువణ్ణామలైయే అరుణాచలమని తెలుసుకొనెను. తమ "అరుణాచలమాహాత్మ్యము"లో రమణమహర్షి యీ విధముగా వ్రాసియున్నారు: "ఏమి అద్భుతము! స్థావరమువలె నిలిచియున్న దీని మహత్తు తెలిసికొనుట కష్టము. చిన్ననాటనుండి అరుణాచలము మహత్వము కలదని ఎరుగుదును. తిరువణ్ణామలైయే అరుణాచలమని చెప్పినప్పుడుకూడ దాని మహత్తు పూర్తిగా తెలుసుకొనలేకపోతిని. ఇప్పుడది నా మనస్సునకు శాంతినిచ్చి, నన్నాకర్షించి, తనఒడిలోనికి నన్ను తీసుకొన్నప్పుడు అరుణాచలమే ఆ నిశ్చలపదార్థమని గ్రహించితిని."

అరుణాచలముగూర్చి వినుటతోపాటు, మరొకటి కూడ అతని మనస్సును పారమార్థికమువైపు మళ్లించుటకు సాయపడెను. శేక్కిలార్ వ్రాసిన శైవభక్తుల చరిత్రలుగల పెరియపురాణము వేంకటరమణకు దొరికెను. అది చదివి అతడు పులకితగాత్రుడయ్యెను. అదే అతడు చదివిన మొదటి మతగ్రంథము. భక్తులజీవితము లతని నాకర్షించెను. పర

మార్గ జీవితమునకు కావలసిన భక్తి వైరాగ్యము లలవరచు కొను కాంక్ష అప్రయత్నముగా అతనిలో రేకెత్తెను.

వేంకటరమణ కిప్పుడు పదునేడు వత్సరములు. 1896–వ సంవత్సరమున నొకనాడతడు పినతండ్రి ఇంటిలో మేడమీాద ఒంటరిగా గూర్చుండియుండెను. అతని ఆరోగ్యమున కేలోటులేదు; కాని హఠాత్తుగా మృత్యుభయ మతని నావరించెను. చచ్చిపోవుచున్నట్లతనికి తోచినది. ఎందు కాభావముకలెనో మాత్ర మెరుగడు. ధైర్యము వదలక, "ఇప్పు డేమి చేయవలె" నని ప్రశాంతముగా ఆలోచించి, "సరే, చావువచ్చిపడినదికాని చచ్చిపోవునదేది? ఈ దేహమే చచ్చును." అనుకొని తత్క్షణము చచ్చినవానివలె నేల మీాద అవయవములు బిగబట్టి, కాళ్లుచేతులుచాచి పరుండెను. ఊపిరి తీయుటకూడ మానెను. పెదవులు బిగించెను. "ఇప్పు డేమగును?" అని ఆలోచింపసాగెను. సరే, ఈ దేహమిప్పుడు చచ్చిపోయినది. దీనిని శ్మశానమునకు తీసుకుపోయి బూడిదగా కాల్చివేయుదురు. కాని దేహముతో నేనుకూడ చచ్చిపోదునా? ఈ దేహమే నేనా? ఈ దేహమిప్పుడు నిశ్చలముగా నిశ్శబ్దముగా నున్నను నావ్యక్తిత్వము నాకు పూర్తిగా గోచరించుచున్నదే! దేహసంబంధావసరము లేకనే లోనుండి "నేను" అనుధ్వని వినబడుచున్నదే! కాన నేను దేహమునుమించిన ఆత్మను. దేహము చచ్చునుకాని ఆత్మ కాదు. నేనా చావులేని ఆత్మనన్నమాట" అని నిశ్చయించుకొనెను. ఇట్లతడు తర్కించుకొన్నట్లగపడుచున్నది కాని, యేతర్క మక్కరలేకనే ఒక్కలిప్తలో

తనలో మెరుపువలె మెరసి సాక్షాత్కరించెనని ఆయనే చెప్పియున్నారు. సత్యమును ముఖాముఖి నాయనదర్శించెను. "నేను" అనునది ఒక్కటే నిజమైన పదార్థము. అంతటితో నతనికి శాశ్వతముగా మృత్యుభయము తొలగిపోయెను. ఎట్టి దీర్ఘదుస్సహ సాధనలు లేకనే వేంకటరమణ ఆత్మసామ్రాజ్య సిద్ధి పొందెను. ఆత్మజ్ఞానముతో అహము నశించెను. వేంకటరమణ అను పిల్లవాడు ఒక్కక్షణములో మహర్షి యయ్యెను.

అతని జీవితములో గొప్పమార్పు కల్గెను. వెనుక ప్రియమైన ప్రపంచ మిప్పు డప్రియమయ్యెను. ఇదివర కలక్ష్యము చేసిన పరమార్థ విషయములే ఇప్పుడు కావలసి వచ్చెను. చదువు, సఖులు, బంధువులు, ఇరుగుపొరుగులు అతని కాసక్తి గొలుపలేదు. వినయము, శాంతము, ఓరిమి, అతనినిప్పు డావరించెను. ఏకాంతమున నతడాత్మచింతనలో మునిగిపోయెడువాడు. ప్రతిదినము మీనాక్షీదేవి ఆలయము నకుబోయి అందలి దేవతలయొక్క, భక్తులయొక్క విగ్రహ ములముందు నిలచి భక్త్యావేశము పొందుచుండెను. కన్నుల వెంబడి అశ్రుధార కారుచుండెను. మేడమీద చూచిన దృశ్య మతనిని విడువకుండెను. అతని జీవితమే మారి పోయెను.

వేంకటరమణ అన్నగారు తమ్మునిలో మార్పు గమ నించెను. చాలసార్లు అతని నిర్లక్ష్యభావమునుగూర్చి సూకలు వేసెను. వేంకటరమణ దృశ్యము గాంచిన ఆరువారములకు

పిదప 1896 ఆగస్టు 29–వ తేదీనాడు ఒక సంఘటన జరిగెను. అతని అశ్రద్ధకు శిక్షగా ఆంగ్లము నేర్పు ఉపాధ్యాయు డతనిని ఒకపాఠము మూడుసార్లు వ్రాయుమనెను. రెండుసార్లు వ్రాసినమీదట అది నిరర్థకమైన పని యని భావించి వేంకట రమణ పుస్తకములు పారవేసి కండ్లు మూసుకొని ఆత్మధ్యానములో మునిగెను. ఇదంతయు చూచుచున్న అన్నగారు వేంకటరమణతో, "ఇలాంటివాడి కిదంతా యేమిలాభము" అని అతని చదువునుగూర్చి అనెను. వేంకటరమణ జవాబు చెప్పలేదు కాని ఇక చదువుచున్నట్లు నటింపదలచుకొనలేదు. ఇల్లు విడచి రహస్యముగా తిరువణ్ణామలై పోదలచెను. మధ్యాహ్నము ప్రత్యేకముగా ఆనాడు బడిపెట్టిరని చెప్పి, భోజనము కావించుకొని, జీతమునకని అన్నయిచ్చిన ఐదు రూపాయలు పుచ్చుకొని బయలుదేరెను. పాత రైల్వే పటములో తిరువణ్ణామలైకు సమీపముననున్న దిండివనము స్టేషన్‌మాత్రము చూపబడెనే కాని క్రొత్తగా తిరువణ్ణామలైకుకూడా వేసిన బ్రాంచిలైను చూపబడలేదు. అన్నగారి కొక ఉత్తరము వ్రాసి, ఆయన కగపడునట్లు ఇంటిలో ఉంచెను. "భగవంతుని ఆజ్ఞప్రకారము; ఆయనను వెదుకుటకు బయలుదేరుచున్నాను. ఇది (నేను) మంచికార్యమునకే పూనుకొన్నది. ఎవరును విచారింపనక్కరలేదు. నన్ను వెదుకుటకు డబ్బు వెచ్చింపవద్దు. నేను కాలేజీ జీతము కట్టుటలేదు. మిగిలిన రెండురూపాయలు ఇందే పెట్టుచున్నాను" అని ఉత్తరమువ్రాసి తన టిక్కట్టుకొరకు మూడురూపాయలు తీసుకొని బయలుదేరెను.

వేంకటరమణ పూర్వీకు లొకసాధువునకు బిచ్చపెట్టని కారణమున నతడు వారికుటుంబములో ప్రతితరమున నొకడు సాధువై తిరుగునని శపించెనట. అది దీవనయే యనుకొన వచ్చును. సుందరయ్యర్ పినతండ్రి సాధువయ్యెను; సుందరయ్యర్ అన్న సాధువయ్యెను. ఇప్పుడు వేంకటరమణ వంతు వచ్చెను. వైరాగ్య మతని హృదయము నింపివేసెను. పరివ్రాజకుడై అతడు బయలుదేరెను.

ఇంటినుండి వేంకటరమణ సాగించిన ప్రయాణము సాహసకార్యమువంటిది. ఆ మధ్యాహ్నము ఇంటినుండి అరమైలుదూరముననున్న స్టేషనునకు నడచి వెళ్లెను. నాడు బండి ఆలస్యముగా వచ్చుటచే అతనికి దొరికెను. దిండివనమునకు రూ. 2-13-0 పెట్టి టిక్కెట్టు కొనెను. అతడెరుగడు కాని తిరువణ్ణామలైకు టిక్కెట్టు సరిగా మూడురూపాయలే. బండిలోనున్న మౌల్వీ ఒకడు వేంకటరమణకు తిరువణ్ణామలై వెళ్లదలచినయెడల దిండివనమువరకు వెళ్లనక్కరలేదనియు, విల్లుపురమువద్దనే దిగి బండి మారి తిరువణ్ణామలై వెళ్ల వచ్చుననియు చెప్పెను. బండి తిరుచ్చిరాపల్లి చేరుసరికి చీకటిపడెను. ఆకలివేయుటచే నత డర్ధణాపెట్టి రెండు జామపండ్లు కొని ఒకటి కొరికినంతలో విచిత్రముగా అతని ఆకలి తీరిపోయెను. తెల్లవార మూడుగంటలకు విల్లుపురములో దిగి ఊరిలో తిరుగుటచే నతనికి మధ్యాహ్నమున కాకలివేసెను. ఒక హోటలులో భోజనముచేసి రెండణాలిచ్చెను. అతనివద్ద నున్నది రెండణాల అర్ధణా మాత్రమే అని తెలుసుకొని హోటలు యజమాని ఆ రెండు అణాలుకూడ పుచ్చుకొన

లేదు. ఆ డబ్బుతో నతడు మాంబలప్పట్టువరకు టిక్కెట్టుకొని సాయంత్రమున కా ఊరు చేరెను. తనవద్దనున్న డబ్బు అంతవరకే టిక్కెట్టునకు సరిపోయెను. అచటనుండి తిరువణ్ణామలై చేరుటకై పదిమైళ్లు నడిచి అలసిపోవుటచే, అచట నొక కొండమీదనున్న అరియణినల్లూర్ దేవాలయ మంటపములోనికి పోయి కూర్చుండెను. ఒక అపూర్వకాంతి ఆ ప్రదేశమునంతను ప్రకాశమానముచేసి అంతర్ధానమగుట అతడు చూచెను. పూజ ముగించుకొని గుడికి తాళములు వేసి అర్చకులు మైలుదూరమున కీలూరులోనున్న మరొక దేవాలయపూజకై పోవలసియుండుటచే, ధ్యానములోనున్న వేంకటరమణను లేపిరి. వారితో అతడును కీలూరుగుడికి పోయి అచట మరల సమాధిలో మునిగెను. తమ పని ముగియగానే మరల అర్చకు లతనిని లేపిరి కాని తిండి పెట్టు ఏర్పాటేమియు చేయరైరి. దేవాలయములో మద్దెల వాయించువా డిదంతయు చూచి జాలితో తనవంతు ప్రసాద మతనికి పెట్టుడని అర్చకులను కోరెను. వేంకటరమణ దాహమని అడగగా దూరముననున్న శాస్త్రిగారి యిల్లు వారు చూపిరి. దారిలో అతడు స్పృహతప్పి పడిపోయెను. మరల తేరుకొనునప్పటి కతనిచుట్టూ జనులు గుమిగూడి యుండిరి. ప్రసాదము తిని నీరు త్రాగి పరుండెను. మరునాడు 1896 ఆగస్టు 31 గోకులాష్టమి. మరల బయలుదేరి తిరువణ్ణామలైవైపు కొంతదూరము నడచి, అలసిపోయెను. చెవినున్న బంగారుపోగులమ్మి ఆ డబ్బుతో భోజనముచేసి రైలుమీద తిరువణ్ణామలై వెళ్లదలచి, ముత్తుకృష్ణభాగవ

తర్ అను నాయన యింటిముందు నిలబడెను. ఆ ఇం
యూమె నాడు కృష్ణాష్టమి కాన ఆ బాలయోగికి కడుపునిం
భోజనము పెట్టెను. భోజనానంతరము వేంకటరమణ త
చెవి పోగులు నాల్గురూపాయిలకు కుదువబెట్టి యాత్ర
ముగింపదలచితినని భాగవతర్‌తో చెప్పెను. సరియైన
బంగారమో కాదో చూచుకొని భాగవతర్ నాల్గురూపా
యలిచ్చి వేంకటరమణ చిరునామా తీసుకొని తన చిరు
నామా నొక కాగితముపై వ్రాసి అతనికిచ్చి యిష్టమువచ్చి
నప్పు డానగ తీసుకుపొమ్మని చెప్పెను. నాడు చేసిన మిఠా
యిలు పొట్లముకట్టి భాగవతర్ భార్య వేంకటరమణ
కిచ్చెను.

నగ విడిపించుకొను ఉద్దేశము లేదు కాబట్టి దారిలో వేంకటరమణ భాగవతర్ యిచ్చిన కాగితము చింపివేసెను. రైలుస్టేషనుకు వెళ్లి మరునాటి ఉదయమువరకు బండిలేదని తెలుసుకొని అక్కడే పరుండెను. సెప్టెంబరు ఒకటి 1896-వ సంవత్సరమున నతడు తిరువణ్ణామలైలో బండిదిగి తిన్నగా అరుణాచలేశ్వరాలయమునకుబోయెను. గుడితలుపులు తెరిచి ఉన్నవి. అర్చకులతోసహా గుడిలో ఎవ్వరును లేరు. గర్భగుడిలోనికిబోయి తన తండ్రియగు అరుణాచలేశ్వరుని ముందు నిలబడి చెప్పరాని ఆవేశము ఆనందముపొందెను. దీర్ఘ యాత్ర ముగిసినది; ఓడ సురక్షితముగా రేవు చేరినది.

వేంకటరమణ మిగతా జీవితమంతయు తిరువణ్ణామలై లోనే గడచెను. శాస్త్రోక్తముగా సన్న్యాసమతడు గ్రహింప

లేదు. ఆలయమునుండి బయటకువచ్చి వీథులలో తిరుగు చుండగా ఎవరో అతనిని పిలిచి తల గొరగనా అని అడిగెను. అయ్యంకులం చెరువువద్ద అతనికి మంగలి క్షౌరము చేసెను. చెరువుగట్టున నిలబడి తనవద్ద మిగిలిన డబ్బు నతడు చెరువులో విసిరివేసెను. పిదప భాగవతర్ భార్య ఇచ్చిన మిఠాయి పొట్లము విసిరివేసెను. తరువాత నీళ్లలోకెగిరిన దతని జంధ్యము. పంచెనుండి ఒక పీలికచింపి గోచిపెట్టుకొని తక్కినదికూడ నీళ్లలోకి విసరెను. ఆలయమునకు పోవుచు వర్షములోతడిసి దేహమునకు వేరే స్నానమెందుకని తలచెను.

మొదట కొన్నివారములు రమణ సహస్రస్తంభ మంటపములో నుండెడివాడు. అతడు ధ్యానములోనుండగా పిల్లలతనిపై రాళ్లురువ్వసాగిరి. అందువల్ల పాతాళలింగ మున్న నేలకొట్టులోనికి పోయి, అంతరాయములు లేకుండ దినముల తరబడి అతడు నిశ్చల సమాధిలో నుండెడివాడు. పురుగులు కుట్టినను గణించువాడుకాడు. పిల్లలీ రహస్య స్థలముకూడ కనిపెట్టి మరల బాలయోగిపై చిల్లపెంకులు రువ్వసాగిరి. వారిని శేషాద్రి అను నొక పెద్దస్వామి తరిమి వేయుచుండెను. తెలియనివారికి శేషాద్రి పిచ్చివానివలె కనబడువాడు. పిదప రమణకు దేహస్పృహ లేనప్పుడు భక్తు లతనిని పాతాళలింగమునుండి ఎత్తుకొనివచ్చి సుబ్రహ్మణ్యా లయమువద్ద నుంచిరి. నాటినుండి ఎవరో ఒక రాయనను గూర్చి శ్రద్ధవహింపసాగిరి. వా రాయన మకాము తోటల లోనికి, ఆలయములలోనికి, తరుచు మార్చుచుండిరి. మాట్లా

డుట కిష్టములేక రమణ మౌనమువహించియుండువాడు ఒకొక్కప్పు డెవరైనను వాశిష్ఠము, కైవల్య నవనీతములన గ్రంథములు తెచ్చి అతనివద్ద చదువుచుండువారు.

తిరువణ్ణామలై వచ్చిన ఆరునెలలకు గురుమూర్తి యను ఆలయపాలకుడగు తంబిరాన్ స్వామి కోరికపై రమణ ఆ ఆలయమునకు తన మకాము మార్చెను. రమణ ఖ్యాతి విస్తరించినకొలది అనేకు లాయనను చూచుటకు వచ్చుచుండిరి. ఒక సంవత్సర మా ఆలయముననున్నపిదప మకాము దగ్గరలోనున్న మామిడితోటలోనికి మార్చబడెను. రమణ తిరువణ్ణామలైలో మహర్షిగా నెన్నబడుచున్నాడని విని, మానామదురైలోనున్న నెల్లియప్ప అయ్యర్ అను మరొక పినతండ్రి యతనిని చూచుటకు వచ్చెను. అతడు రమణను తనతో తీసుకొనిపోవలెనని ప్రయత్నించెను కాని రమణ యతనియెడ నేమాత్ర మాసక్తిచూపలేదు. అతడు వెళ్లిపోయి రమణతల్లికి వార్త పంపెను.

పెద్ద కొడుకును తీసుకొని తల్లి రమణవద్దకు వచ్చెను. అప్పుడతడు పవళక్కున్రి అను అరుణాచలము తూర్పుకొన నుండెను. గోలపెట్టి ఏడ్చుచు, రమణ నింటికిరమ్మని తల్లి ప్రార్థించెను. రమణ నోరువిప్పలేదు; ఒక కాగితముమీద తల్లికేదైనా వ్రాసియిండని ఒక శిష్యుడు కోరగా, "ప్రారబ్ధానుసారము భగవంతుడు నడిపించును. ఎంత తలక్రిందులైనను కానివి కావు; జరుగవలసినవి జరుగక మానవు. దీనికి తిరుగు లేదు. కాన ఉదాసీనముగా ఉండుటే ఉత్తమ జ్ఞానము" అని వ్రాసి ఇచ్చెను.

విఫలమై తల్లి వెళ్లిపోయెను. ఆ పిదప అరుణాచల పై భాగముననున్న విరూపాక్షగుహలో రమణ నివసింప సాగెను. ఇక్కడకూడ జనులతని చూచుటకు వచ్చుచుండిరి. వారిలో కొందరు నిజమైన భక్తులువచ్చి పారమార్థికానుభవములనుగూర్చి సద్గ్రంథములగూర్చి అడుగుచుండిరి. ఒకొ్కక్కప్పుడు రమణ వారికి జవాబులు వ్రాసి ఇచ్చుచుండెను. శంకరాచార్యులవారి వివేకచూడామణి నొకరు తెచ్చిరి. తరువాత రమణ దానిని సులభ తమిళములోని కనువదించెను. కొందరు చదువురానివారుకూడ ఆధ్యాత్మికాసక్తితో వచ్చుచుండిరి. ఎచ్చమ్మాళ్ అటువంటిదే. భర్తను, కొడుకును, కూతును గోల్పోయి తుద కదృష్ట వశాత్తు ఆమె రమణవద్ద చేరుకొనెను. ప్రతిదినము రమణకు, అతనివద్దనున్నవారికి భోజనము తెచ్చు నియమమామె పెట్టుకొనెను.

1903 లో రమణ వద్దకు శ్రీగణపతిశాస్త్రి యను గొప్ప సంస్కృతపండితుడు వచ్చెను. ఆయన నియమనిష్ఠలనుచూచి గణపతిముని అనికూడ ఆయన ననెడివారు. ''కావ్యకంఠ'' మతని బిరుదు. శిష్యులతనిని 'నాయనా' అని పిలుచుచుండిరి. శ్రీవిద్యలో అతడు నిపుణుడు. భగవంతుని జగన్మాతగా పూజించువాడు. విరూపాక్షగుహకేగి యతడు రమణను కొన్నిసార్లు దర్శించెను. తన ఆధ్యాత్మికసాధనలలో కల్గిన సందేహములగూర్చి రమణతో, ''చదువతగినదంతయు చదివితిని. వేదాంతశాస్త్రములు పూర్తిగా అర్థముచేసుకొంటిని. మనసార జపమొనర్చితిని. కాని ఇంతవరకు తపస్సన

నేమియో నా కర్థముకాలేదు. నీ శరణుజొచ్చితిని. నాకు బోధింపు" మని ప్రార్థించెను. రమణ మౌనమువిడిచి యిట్లు పల్కెను. "'నేను' అనునది యెచట పుట్టునో గ్రహించితి వేని అందే మనస్సు లీనమగును. అదే తపస్సు. జపించు నప్పుడు మంత్రధ్వని ఎచట పుట్టునో గ్రహించిన మనస్సందు లీనమగును; అదే తపస్సు." రమణ కరుణచే పండితుని సంశ యముతీరెను. రమణ మహర్షి యనియు, భగవానుడనియు ప్రకటించినది శాస్త్రియే. రమణమహర్షి నితడు సంస్కృత శ్లోకములలో కీర్తించెను. రమణ బోధనలను "రమణగీత" అను చిన్న కావ్యముగా రచించెను.

రమణ పెద్దన్న చనిపోయెను. తమ్ముడు నాగసుందర మొకమారు తిరువణ్ణామలై వచ్చెను. కాశీయాత్ర చేసి వచ్చినమీాదట తల్లికూడ రెండుసార్లు రమణవద్దకు వచ్చెను. ఒకసారి ఆమె టైఫాయిడ్ జ్వరము పడినప్పుడు రమణ శ్రద్ధతో శుశ్రూష చేసెను. తల్లిజబ్బు కుదర్చుమని అరుణా చలుని ప్రార్థించుచు ఒక గీతము వ్రాసెను. దానిలో, "అరుణాచలేశ్వరా, అనంతతరంగములవలె కలుగుచున్న అనంతజన్మలను రోగము మాన్పుటకు పర్వతాకారముదాల్చి నిల్చిన ఔషధమీావు. నీచరణమునే నమ్ముకొన్న నాతల్లి కారోగ్యము ప్రసాదించుట నీధర్మముకాదా?" అనియు, తల్లికి దర్శనమిచ్చి ఆమె ప్రపంచాభిమానము తొలగింపు మనియు ప్రార్థించెను. ఆ రెండుకోరికలు సిద్ధించినవని వేరే చెప్పవలెనా? జబ్బు తగ్గినమీాదట అలగమ్మాళ్ మానామధు

రకు వెళ్ళిపోయెను; కాని త్వరలోనే, అనగా 1916 లో రమణవద్దనే ఉండిపోవుటకు వచ్చివేసెను. తమ్ముడు నాగసుందరముకూడ, భార్య చనిపోయినమీదట, నిరంజనానందుడను పేరిట సన్న్యాసియై రమణవద్దకు వచ్చివేసెను. భక్తులతనిని చిన్నస్వామి అని పిలువదొడగిరి. తల్లివచ్చిన వెనుక రమణ విరూపాక్షగుహాకన్న కొంచె మెత్తుననున్న స్కంధాశ్రమమునకు మకాము మార్చెను. తనతల్లికి గాఢ పరమార్థజీవిత శిక్షణ కలుగజేసెను. ఆమె కాషాయము కట్టసాగెను. ఆశ్రమమున వంటపెత్తన మామెయే పూనుకొనెను. 1920 నుండి అలగమ్మాళ్ వృద్ధాప్యముచే నీరసింపసాగెను. రమణ శ్రద్ధానురాగములతో రాత్రిళ్లు జాగరము కూడ సేయుచు ఆమె సేవచేసెను. వైశాఖ బహుళ నవమి, 19 మే 1922–వ సంవత్సరమున నామె పరమపదించెను. ఆమె మృతశరీరము కొండమీదనుండి క్రిందకు తీసుకువచ్చి పాలితీర్థ సరస్సునకును దక్షిణామూర్తి మంటపమునకును మధ్యప్రదేశమున దహనముచేసిరి. దగ్గరనే ఉండి రమణ దహనక్రియ తిలకించెను. నాటినుండి నిరంజనానందుడు తల్లి సమాధివద్దనే మకా మేర్పరచుకొనెను. స్కంధాశ్రమము నుండి రమణ ప్రతిదినము వచ్చి తల్లి సమాధిని దర్శించుచుండెను. ఆరునెలల తరువాత దైవాజ్ఞప్రకారము కొండ మీదనుండి తల్లిసమాధివద్దకే రమణ వచ్చివేసెను. దానితో ప్రస్తుత రమణాశ్రమ మేర్పడెను. 1949 లో తల్లిసమాధిపై నొక దేవాలయము కట్టిరి. క్రమముగా ఆశ్రమము పెరిగెను. హిందూదేశమునుండియేగాక, ప్రపంచ మంతటినుండియు

భక్తులు రమణ వద్దకు పారమార్థిక సాహాయ్యమర్థించి వచ్చుచుండిరి.

మొదట వచ్చిన పాశ్చాత్య భక్తుడు ఎఫ్. హెచ్. హంఫ్రిస్. ఇతడు 1911 లో వెల్లూరుకు పోలీసు ఉద్యోగిగా వచ్చెను. గుప్త శక్తుల గడించు సాధన లాచరించుచు, ఎవరైనా మహాత్ముడు దొరకునా అని చూచుచుండెను. అతనికి తెలుగు నేర్పు ఉపాధ్యాయు డాతనికి శ్రీగణపతిశాస్త్రితో పరిచయము చేసెను. శాస్త్రిగా రాయనను రమణవద్దకు తీసుకొ వెళ్లెను. హంఫ్రిస్ రమణచే నాకర్షితుడయ్యెను. ప్రథమ దర్శనముగూర్చి అతడిట్లు వ్రాసెను, "గుహలో రమణ పాదములవద్ద మౌనముగా చాలసేపు కూర్చుంటిమి. నే నున్నతస్థితిలోనికి పోయినట్లు నాకనుభవమయ్యెను. అరగంట సేపు రమణకండ్లలోనికి చూచుచుంటిని. గంభీరధ్యానముద్ర ఎప్పుడు ఆయన కండ్లలో కన్పించును. ఆయన ప్రశాంతత, ఆత్మనిగ్రహము, ఆత్మసాక్షాత్కారశక్తి వర్ణనాతీతములు." రమణ సంపర్కమువల్ల హంఫ్రిస్ పారమార్థిక భావములు సరియైన దారిని పట్టెను. తిరిగి అనేకపర్యాయము లతడు రమణను దర్శించెను. తనభావముల నత డింగ్లండులోని ఒక స్నేహితునకు వ్రాయగా, అవి ఒక పత్రికలో ముద్రితము లయ్యెను. ఒక లేఖలో హంఫ్రిస్, "ఆయన నవ్వుకన్న సుందరమైనది నీ వూహింపలేవు. ఆయన సన్నిధిలోనున్నందున మనలో కల్గు మార్పు విచిత్రమైనది" అని వ్రాసెను.

ఎప్పుడు సజ్జనులేకాదు, ఒకొక్కప్పుడు దుష్టులుకూడ ఆశ్రమమునకు వచ్చుచుండిరి. 1924 లో రెండుసార్లు ఆశ్రమ

ము లో దొంగలు పడిరి. దొంగిలింపదగినదేదియు దొరకక క్రోధముతో రెండవసారి వారు మహర్షినే కొట్టిరి. వారిని పట్టి శిక్షింపబూనిన శిష్యునితో మహర్షి "వారిధర్మము వారిది; మనధర్మము మనది; సహింపవలసినది మనము" అని చెప్పెను. దొంగలు తన ఎడమ తొడమీద కొట్టినప్పుడు రమణ వారితో "నీకు సంతృప్తికలుగనిచో నా కుడి తొడ మీాద కొట్టవచ్చు"నని చెప్పెను. దొంగల సంగతి తరువాత అడిగిన ఒకశిష్యునితో రమణ, "నాకుకూడ పూజ ముట్టినది" అని చమత్కారముగా చెప్పెను.

ఆశ్రమములోని అహింసాతత్వము పక్షులను, జంతువులనుకూడ మహర్షికి సఖులుగా నొనర్చెను. భక్తులయెడ చూపు ఆదరణనే వానియెడకూడ రమణ చూపుచుండెను. వానిగూర్చి "అది, అవి" అని వాడక "ఆమె, అతడు" అనే ఆయన పల్కుచుండువాడు. పక్షులు, ఉడతలు, ఆయన చుట్టుపక్కలనే గూళ్లు కట్టుకొనెను. ఆవులు, కుక్కలు, కోతులుకూడ ఆశ్రమము చేరుకొనెను. అవి అన్నియు తెలివి తేటలతో సంచరించెడివి. ముఖ్యముగా లక్ష్మి అను ఆవు ఎంతో తెలివైనది. వాటి రహస్యములన్నియు ఆయన కెఱుక. వాటికి ఆయన చక్కగా మేత పెట్టించువాడు. వానిలో యేదైన చనిపోయినయెడల శాస్త్రోక్తముగా పాతి పెట్టించువాడు.

క్రమేణా ఆశ్రమమునకు ఎక్కువమంది రాసాగిరి. కొందరు దీర్ఘకాలముండిపోయెడివారు. ఆశ్రమము పెరిగెను.

ఆవులశాల, వేదపాఠశాల, ప్రచురణాలయము, నిత్యపూజా విధులతో మాతృమందిరము వెలసెను. తనకొరకు కట్టిన హాలులోనే కూర్చుండి రమణమహర్షి అన్నియు చూచు చుండెడివాడు. ఆయన సదా ఊరక కూర్చుండువాడు కాడు. విస్తళ్లు కుట్టుచు, కాయగూరలు తరుగుచు, అచ్చుపడిన ఫారములలో తప్పులు దిద్దుచు, పుస్తకములు వార్తాపత్రికలు చదువుచు, వచ్చిన ఉత్తరములకు జవాబులు చెప్పి వ్రాయిం చుచు, కార్యనిమగ్నుడైనను దేనికి అంటకయుండెడివాడు. ఎక్కడెక్కడికో రమ్మని అనేక ఆహ్వానములు వచ్చెడివి. తిరువణ్ణామలైను దాటి మహర్షి ఎక్కడికిని వెళ్లలేదు. చివరిదినములలో ఆశ్రమ ఆవరణే దాటలేదు. సాధారణ ముగా పగలంతయు ఆయన యెదుట మౌనముతో భక్తులు కూర్చుండువారు. ఒకొక్కప్పు డేమైన అడుగుచుండెడివారు. మహర్షి కిష్టమైన మాట్లాడువాడు. ఆయన కెదురుగా కూర్చుండి, ఆయన ఉజ్వలనేత్రముల చూచుచుండుటే ఒక అనుభూతి. ఆయన యెదుట కాలమే స్తంభించినట్లుండెడిది. వర్ణనాతీతమైన శాంతిని పొందినట్లు చాలమంది కనుభవ మయ్యెడిది.

తిరువణ్ణామలైకు రమణ రాకయొక్క స్వర్ణోత్సవము 1946 లో జరిగెను. 1947 లో ఆయన ఆరోగ్యము సన్నగిల్ల నారంభించెను. డెబ్బదియేండ్లుకూడ ఆయనకు లేకున్నను, అంతకన్న వృద్ధునివలె కాన్పించుచుండెను. ఎడమ మోచేతి క్రిందిభాగమున నొక కంతి వంటిది 1948–వ సంవత్సరాంత మున కన్పించెను. అది పెరుగుచుండుటచూచి, ఆశ్రమము

లోని డాక్టరు దానికి శస్త్రచికిత్స చేసెను. ఒక నెలలో అది తిరిగి పొడచూపెను. మద్రాసునుండి డాక్టర్లు వచ్చి మరల శస్త్రచికిత్స చేసిరి. పుండు మానలేదు. కంతి మరల కన్పించెను. అది ఒకరకపు వ్రణమని (Sarcoma) డాక్టర్లు గ్రహించిరి. అంతవరకు చేయి తీసివేయవలెనని డాక్టర్లు అభిప్రాయపడిరి. నవ్వుచు రమణ, "భయపడనక్కఱలేదు. దేహమే ఒకరోగము. దానిని సహజపరిసమాప్తి పొందనిండు. దానిని ముక్కలుచేయుటేల? శుభ్రముగా కడిగి కట్టుకట్టిన చాలును" అని సెలవిచ్చెను. ఐనను మరి రెండు శస్త్రచికిత్సలు జరిపిరి. కాని గడ్డ మరల కనిపించెడిది. దేశీయవైద్యములు, హోమోంపతివైద్యము నడిపిరి. కాని లాభములేకపోయెను. రమణకుమాత్రము దానిగొడవ లేదు. బాధను లక్ష్యమేచేసెడువాడుకాడు. రోగము తనదేహమును క్రమముగా తినివేయుచున్నను, తనకు కానట్లు చూచుచుండెను. కండ్లెప్పటివలెనే మెరియుచుండెను. ఆయన కరుణ అందరిపైనను ప్రసరించుచునే ఉండెను. అనేకులు వచ్చుచుండిరి. ఎవ్వరిని ఆటంకపరుపవద్దని అందరికి దర్శనమిచ్చుచుండెను. తమ మహాత్వశక్తులవల్ల తమ రోగము బాగు చేసుకొనుడని భక్తులు రమణమహర్షిని కోరిరి. ఆయన కృపచే తమలో కొందరి కట్టిశక్తులున్నట్లు భక్తులు భావించుచుండిరి. ఇక మహర్షి కట్టి శక్తులుండకపోవునా? తనబాధను చూచి దుఃఖించు భక్తుల నూరడించుటకు రమణమహర్షి వారినిచూచి, "మీరీ దేహమునే రమణభగవానుడనుకొని రోగ మతని కంటగట్టుచున్నారు. అయ్యో, యేమి తెలివి

తక్కువ! భగవానుడు మిమ్ము విడిచి పోవునని చింతించు చున్నారు! ఎక్కడికి పోగలను? ఎట్లు పోగలను?" అని వారి నోదార్చెను.

1950 ఏప్రిల్ 14-వ తేదీయే అంతిమదినము. నాటి సాయంత్రము వచ్చినవారికి మహర్షి దర్శనమిచ్చెను. అంతము సమీపించుచున్నదని వచ్చినవా రెరుగుదురు. "అరుణాచల శివా" అను పల్లవితో రమణమహర్షి వ్రాసిన గీతము వారు పాడసాగిరి. తన్ను కూర్చుండబెట్టుడని మహర్షి కోరెను. తన కాంతిమంతమైన కరుణానేత్రములు కొద్దిసేపు విప్పి చూచెను. ఒక చిరునవ్వు ముఖమున చిందెను. కనుకొనల నుండి ఆనందాశ్రువులు రాలెను. 8-47 నిమిషములకు శ్వాస ఆగిపోయెను. ఆయాసముకాని ఒగర్పుకాని లేదు. చనిపోయి నట్లే కనుపించలేదు. అదేసమయమున ఆకాశమున నొక ఉల్క నెమ్మదిగా పయనించుచు పావన అరుణాచలశిఖరము చేరి అదృశ్యమయ్యెను.

మహర్షి ఎప్పుడో కాని వ్రాయువాడు కాడు; భక్తుల కోరికమీదనే యేదైనను వ్రాసినది. ఆయనే ఒకసారి, "నాకు వ్రాయవలెనని ఉండదు. ఏదో సందర్భము ననుస రించి ఎవరో ఒకరు కోరగా వ్రాసినవే నా రచనలు" అని చెప్పిరి. అప్పుడప్పు డాయన వ్రాసిన గీతములు గ్రంథస్థము లయ్యెను. ఆయన "ఉపదేశసారము"లో వేదాంతసార మున్నది. ఆయన అరుణాచలమునుగూర్చి ఐదు గీతములు వ్రాసెను. శంకరాచార్యులవారి వివేకచూడామణిని, ఆత్మ

బోధ మొదలగు గ్రంథములను అరవములోని కనువదించెను. ఆయన విశేష మరవములోనే వ్రాసెను. సంస్కృతము, తెలుగు. మళయాళములలోకూడ వ్రాసెను.

మహర్షిది అద్వైతవేదాంతము. దాని కాత్మసాక్షాత్కారమే ఆశయము; ఆత్మవిచారమే ప్రధానమార్గము. 'నేను' అనునదేది? మనము దేహమునే 'నే' ననుకొందుము. నేను లావుగా నున్నాను, నేను సన్నముగా నున్నాను అని అనుచుందుము. కాని 'నే' ననునది దేహము కాదు. దేహము జడము; 'నే' నని అది అనలేదుకదా! నేననున దేది, అని విచారణకు బూనుకొనునది అహమే. కాన ముందరీ అహము చచ్చినగాని ఆత్మజ్ఞాన మబ్బదు. అందుచే జ్ఞానాగ్నిలో అహము నాహుతిసేయుటే సర్వోత్కృష్ట యజ్ఞముగా భావింపబడుచున్నది.

అహమునుండి ఆత్మను విడదీయుట కష్టమే కాని అసాధ్యముకాదు. నిద్రావస్థ పరిశీలించిన నిది అవగతమగును. నిద్రలో అహ మణగినప్పుడును 'నే' నున్నాను. అహమప్పుడు పనిచేయుటలేదు. అహము, దానితోపాటు సర్వ ప్రపంచము అదృశ్యమగుట ఆత్మ గమనించుచునేయున్నది. ఆ ఆత్మ గనుక లేకపోయిన, నిద్రలేచి, "హాయిగా, ఒళ్లు మరచి నిద్రపోతి"నని ఎట్లు చెప్పగల్గుదుము. అహము ప్రబలిపోవుటచే ఆత్మను గ్రహింపలేకున్నాము. ప్రపంచానుభవములన్నియు అహముతో కూడుకొనియున్నవి. నిద్రలోనుండి లేవగానే అహముతోపాటు సర్వప్రపంచము తిరిగి

వచ్చిపడుచున్నది. కాన అహము చాల బలమైనది అడ్డు లేనిదిగా కనబడును.

కాని, అహము వట్టి పేకముక్కల కోట. ఆత్మవిచారమారంభమైనయెడల ఆ కోట నేలకూలును. ఆత్మవిచారము చేయుటకు పదార్థజ్ఞానముమాత్రమిచ్చు మనస్సుకన్న తీక్ష్ణతరమైన బుద్ధి అవసరము. ఏకాగ్రబుద్ధి సహాయమున సత్యము దర్శింపవచ్చును. ఆత్మసాక్షాత్కారమునకుముందు యీ బుద్ధికూడ లయము కావలసి ఉన్నది. అంతవరకు బుద్ధి విచారణ సల్పుచుండవలసినదే. నిరంతరకృషితో ఈ విచారణ సాగించవలెను. సోమరులకు జ్ఞాన మలవడదు.

మనస్తత్వము గ్రహించుటకు చేయు మానసిక యత్నమువంటిదికాదు "నే" నెవరు అని సల్పెడి విచారణ. మనస్సుయొక్క మూలముపై యావద్దృష్టిని నిల్పి విచారణ చేయవలెను. మనశ్చాంచల్యములకు లోనుగాక, దాని ప్రవాహమున కెదురీది, తుదకు మనఃపరిణామముల నతిక్రమింపవలెను. ఇట్లహముయొక్క మూలము కనుగొనగానే అది అంతర్హితమగును. అప్పుడు ఆత్మ నిజప్రభావముతో ప్రకాశించును. ఆ ప్రకాశమునే సాక్షాత్కారమనియు, ముక్తియనియు అందురు.

దేహ ముండుట, ఊడుటతో ముక్తికి సంబంధము లేదు. రమణమహర్షి కున్నట్లు దేహముండవచ్చును; ప్రపంచముతో సంబంధముండవచ్చును. ఆత్మదర్శనము కలినవారి కవి అంతరాయములుగావు. నిజమున కట్టివానికి దేహము లేదు,

ప్రపంచము లేదు. అతనికి కలది సచ్చిదానందస్వరూపమగు ఆత్మ యొక్కటే. ఈ అనుభవము మనకు నిద్రలో కల్గును. నిద్రలో బాహ్యవస్తుప్రపంచముకాని అంతరస్వప్నప్రపంచముకాని లేదు. కాని మాయమాత్ర మా అనుభవమును కప్పివేయుండును. అందుచే తిరిగి స్వప్నభ్రమలలోను, జాగ్రత్ప్రపంచభ్రమలలోను పడిపోవుచుందుము. మాయ తొలగినప్పుడు తిరిగి యీ ద్వంద్వములో పడిపోవుట తప్పును. ఇది సాధ్యమొనర్చుటే వేదాంతలక్ష్యము. ఎట్టిపతితులకైనను ధైర్యముకొల్పి, నిరాశారూపమునుండి పైకివచ్చుటకు సాయపడుటే రమణమహర్షి వంటివారి పుట్టుకయొక్క పరమార్థము.












SUBA